ఓం

# పార్థివపదార్థ చికిత్సాచంద్రిక

మచిలీపట్టణములోని
"సరస్వతీ నికేతనము" వారిచే
ప్రచురింపబడినది.



చెన్నపురి
ఆంధ్రపత్రికా ముద్రాలయమున
ముద్రితము

౧౯౧౭

 [వెల ౧-౦-౦

# పీఠిక

"టిస్యూరెమిడీసు" అను ద్వాదశ పార్థివపదార్థముల గూర్చిన గ్రంథము లాంగ్లభాషయందనేకములు గలవు. కాని యాంధ్రభాషయందు లేవు. మనదేశమం దీచూర్ణములనే వాడు పెద్ద వైద్యాలయములు 'మంగుళూరు' మొదలగు ప్రదేశములయం దున్నవి. వీనిని దినుటవలన నతి కఠినవ్యాధులు గూడ సులభముగ నయమగును. మఱియు పసిపిల్లల యుపయోగమున కింతకంటె నుత్తమ మగు మందులు లేవని చెప్పుట యతిశయోక్తిగాదు. ఈమందులు ప్రమాదరహితములు కావున వైద్యులుగాని వారు గూడ ధారాళముగ వాడవచ్చును.

అందువలన ఇంగ్లీషురాని వైద్యులు—స్త్రీలు—గృహస్థులకొఱకు "పార్థివపదార్థ చికిత్సాచంద్రిక" యను నీ గ్రంథమును బ్రచురించియున్నాను. ఇది యాంధ్రుల యాదరణకు

బాత్రమైనచో, ఈ వైద్యుతత్త్వమును గూర్చి విపులముగ దెలుపు మరియొక గ్రంథమును బ్రచురింపదలచియున్నాను.

ఈ గ్రంథమును సలక్షణముగను త్వరితముగను ముద్రింపించిన హెచ్. వి. కృష్ణ అండు కో. కార్యనిర్వాహకులగు మ. రా. రా. శ్రీ, చతుర్వేదుల వేంకటకృష్ణగారికి వందనము లాచరించుచున్నాను.

సరస్వతీనికేతనము
బందరు
౧-౧౧-౧౭

ఇట్లు,
విన్నవించు విధేయుఁడు
గ్రంథకర్త.

# పార్థివపదార్థములు



ఈ పార్థివలవణములు గాని, ధరలను దెలుపు పట్టికను గాని కావలసినవారీ క్రింది విలాసమునకు వ్రాసికొనవలయును.

మేనేజరు
'సరస్వతీ నికేతనము.'
మచిలీపట్టణము.

# విషయసూచిక.

---

పుటలు.

—

# పార్థివపదార్థ చికిత్సా చంద్రిక

## ప్రథమ ప్రకరణము

జీవిశరీరము, చిన్న చిన్న కోశములతోడ, నిర్మింపబడియున్నది. పలువిధము లగు కోశములవలన, శరీరమందలి, వివిధవిధానములును, యంత్రములును, నిర్మింపబడుచున్నవి. కోశములయందు * నిర్జీవపదార్థము లుండును. ఆ నిర్జీవపదార్థములవలననే, కోశములు వే అగుచున్నవి. మానవశరీరమును గాని, అం దేదయిన

* 'ఇనార్గానిక్' అనుమాటకు, 'నిర్జీవ పదార్థము—,' 'పార్థివపదార్థము,' 'ఆర్గానిక్' అను మాటకు 'సజీవపదార్థము' జాంతవపదార్థము అను మాటల నుపయోగించితిమి.

భాగమునుగాని, దగ్ధ మొనర్చినయెడల, అందలి సజీవపదార్థ మంతయు తగులబడి ధూమాకార మున నెగిరిపోవును. కాని కొంత భస్మము మాత్రము మిగులును. ఆ భస్మమునే నిర్జీవ పదార్థము, లేక పార్థివలవణ మని చెప్పుదురు. లోహము - క్షారము - సోడా - మొదలగునవి, నిర్జీవపదార్థములు. నిర్జీవపదార్థములు గలియని యెడల, సజీవపదార్థములు, శరీరమం దే కార్య మును జేయజాలవు. కాని శరీరనిర్మాణమునకు, నిర్జీవపదార్థములే గాక, సజీవపదార్థములును, జలమును గూడ ముఖ్యతమము లని గ్రహించ వలయును.

బ్రతికియున్న మానవుని శరీరమందు, ౧౦౦ భాగములకు ౭౦ భాగములు జలసంబంధమగు పదార్థమును, ౨౫ భాగములు సజీవపదార్థ మును, ౫ భాగములు మాత్రము పార్థివ పదా ర్థము లుండును.

ఈ నిర్జీవపదార్థములే, శరీరనిర్మాణమునకు ముఖ్యాధారములై యున్నవి. ప్రతి కోశమందును, నిర్జీవపదార్థము లుండవలసిన పరిమాణముండినయెడల, శరీర మారోగ్యవంత మై యుండును. మఱియు, జీవితము వృద్ధియగును. నిర్జీవపదార్థములు లోపించుటవలన, కోశములు వికృతినొందును. ఆ వికృతినే రోగమని చెప్పుచున్నాము. కావున రోగ నివారణముకొఱకు నిర్జీవపదార్థములను సేవించవలయును.

బాగుగ తయారుచేసిన నిర్జీవపదార్థములను బుచ్చుకొనినయెడల నా లక్షణములు, నిర్జీవపదార్థములు లోపించిన కోశములయందు ప్రవేశించును. అందువలన కోశములు, యథాస్థితికి వచ్చును. అప్పుడు రోగము నయమగును. నయమగుటకు వీలుగాని రోగముల ఉద్ధృతిని తగ్గించి, రోగికి విశ్రాంతిని గలిగించును.

ఏ పార్థివపదార్థము శరీరమందు లోపిం

చునో, తిరిగి యీ పదార్థమువలన నా లోప మును బూర్తిచేయుటయే, వైజ్ఞానిక పార్థివ పదార్థ చికిత్సా నిదానము. దప్పి యైనప్పుడు జలమును ద్రావినయెడల దాహము తీఱునుగదా. అటులే నిర్జీవ లవణములను సేవించిన యెడల, అభావమొందిన కోశములు యథాస్థితికివచ్చును. సమస్త జాడ్యములు నయమగును. ఇంతకంటె స్వభావసిద్ధ మగు నియమము మఱేదిగలదు?

భోజనపదార్థములు- పానీయములు- సూర్య కిరణములు-, వాయువు, మొదలగు వాని నుండి నిర్జీవ పదార్థములను మానవుడు, స్వీక రించుచున్నాడు. మనము తిను పదార్థములు జీర్ణకోశమందు బ్రవేశించి యచ్చట జీర్ణమై రక్తముగ బరిణమించును. ఆ రక్తమందు నిర్జీవ పదార్థము లుండవలసిన పరిమాణ ముండుట వలన, మన మారోగ్యమును గలిగి జీవించు చున్నాము.

వృక్షములు, లతలు, సస్యములు మొదలగునవి గూడ, మృత్తిక, వాయువు, జలము, మొదలగు వానినుండి నిర్జీవ పదార్థములను స్వీకరించు చున్నవి. కాని భూమియందు పార్థివ పదార్థములు లేకుండిన యెడల, వృక్షములు, లతలు, సస్యము మొదలగునవి బాగుగ వృద్ధి నొందవు. బాగుగ పెరుగని వృక్షములకు, లయిము, సోడా, మొదలగు వానిని, ఎరువుగ వేయవలయును. వానిని వృక్షములు స్వీకరించి యభివృద్ధి నొంది మంచి ఫలముల నిచ్చును. అటులే మానవులు గూడ నిర్జీవపదార్థములను గైకొను చుందురు. భోజన పదార్థములు జీర్ణము గానియెడల, నిర్జీవపదార్థములు చేరవలసినంత పరిమాణము శరీరమందు జేరవు.

నూఱు గ్రయినుల గోధుమలను దగ్ధముగ నొనర్చినయెడల, ఒకటి లేక యొకటిన్నర గ్రయినుల భస్మము మాత్రము మిగులును. ఆ

భస్మమే నిర్జీవపదార్థము. దానియందు పం డ్రెండు విధము లగు నిర్జీవ లవణము లుండును. గోధుమయొక్క లీ నిర్జీవ లవణములను, భూమి నుండి యాకర్షించు చున్నవి. కావున గోధుమ లను దినినయెడల, అందుండు నిర్జీవ లవణములు, ఆయా కోశములయందు ప్రవేశించును. అటు లే మనము తిను నాహార పదార్థముల యందలి పార్థివ లవణములు గూడ కోశముల యందు ప్రవేశించు చున్నవి.

భోజన పదార్థములయందు, పాలు ముఖ్య మైనవి. వానియందు పార్థివలవణము లీక్రింద వివరించినటు లుండును. ౧౫౭౭౩ గ్రెయినుల పాలయందు, పటాసీ, ౦-౭౮, సోడా ౦-౨౩ లయిము ౦-౩౩ మ్యాగ్నిసియా ౦-౦౬ అయి రను, ౦-౦౦౪ ఫాస్ఫరికాసిడ్డు ౦-౪౭ క్లోరిణీ ౦-౪౪ భాగములుండును. ఇవిగాక సిలీ షియా మొదలగునవి యత్యల్పముగ నుండును.

౧౫౮౮౩ గ్రెయినుల మనుష్య రక్తమందు, లోహము ౦-౯౯౮, పొటాస్ సల్ఫేట్టు ౦-౧౩౭, పొటాసు ఫాస్ఫేట్టు ౨-౩౮౩, పొటాసు క్లోరయిడ్డు ౩-౦౭౯, సోడా ఫాస్ఫేట్టు ౦-౬౩౩, సోడా ౦-౩౮౮, క్యాలీసియం ఫాసుఫేట్టు, ౦-౦౯౮, మ్యాగ్నిసియం ఫాస్ఫేట్టు ౦-౦౬౦ భాగము లుండును.

ఈ లెక్కలవలన మానవ దేహమందలి పార్థివపదార్థముల పరిమాణ మత్యల్పమని తేలుచున్నది. కావున తదనురూపముగ పార్థివలవణములను గూడ సూక్ష్మముగ సిద్ధము చేయవలయును.

కావున నీ యౌషధములలో ౩-౮-౫-౬ మం. చూర్ణములను గాని, వానితో తయారు చేసిన మాత్రలను గాని, సర్వసామాన్యముగ నుపయోగింప వచ్చును. దీర్ఘ జాడ్యమైన యెడల కోశములు ముడుచుకొని పోవును.

అందువలన ౩-౪-౫-౬ వ. చూర్ణములలోని మందు, కోశములయందు ప్రవేశింప జాలదు. కావున నట్టి జాడ్యములకు, ౧౨-౩౦-౧౦౦-౨౦౦- వ. చూర్ణములను వాడవలసి యుండును.

## పార్థివపదార్థముల నామధేయములు

(౧) క్యాలికేరియా ఫ్లోరికా (క్యాలికేరియా ఫ్లవరు)
(౨) క్యాలికేరియా ఫాస్ఫారికా (క్యాలికేరియా ఫాస్)
(౩) క్యాలికేరియా సల్ఫ్యూరికా (క్యాలికేరియాసల్ఫ)
— ఈ మూడును సున్నము (లైము) నకు సంబంధించినవి.

(౪) ఫెరంఫాస్ ఫారికం (ఫెరంఫాస్) — ఇది యినుమునకు (అయిరను) సంబంధించినది.

రాసాయినిక రూపమున సిద్ధముచేసిన పార్థివ లవణములను, పరిశుభ్రమగు పాలు పంచదారయందు గలిపి, తీవ్రముగ మర్దించినయెడల నీ చూర్ణము లగుచున్నవి.

ఒక భాగము పార్థివలవణమునందు, తొమ్మిది భాగములు, పాలు పంచదారను గలుపవలయును. వానిని గాజుతో జేసిన ఖల్వమందు బోసి, విరామము లేకుండ తీవ్రముగ పది గంటల కాలము మర్దించిన యెడల ౧ మ. చూర్ణము సిద్ధమగును. కాని యందలి యౌషధము మిక్కిలిగ సూక్ష్మత నొందదు. అందువలన తిరిగి ౧ మ. చూర్ణ మొక భాగమును, పాలు పంచదారను తొమ్మిది భాగములును, కలిపి పదిగంటల కాలము విరామము లేక తీవ్రముగ మర్దన చేయవలయును. అప్పుడది ౨ మ. చూర్ణమగును. ఇదేవిధముగ తిరిగి తిరిగి మర్దనను చేయుచుండిన యెడల ౩-౪-౫-౬ మ.

ల చూర్ణములు సిద్ధము లగును.

౬ వ. చూర్ణమును సాధారణముగ నందఱు వాడుకొనుచుండవలయును. దీనియం దౌషధ పరిమాణ మత్యల్పముగ నుండును. ఒక గ్రెయిను ౬ వ. చూర్ణమును పది లక్షల భాగ ములుగ నొనర్చినయెడల నం దొక భాగము మాత్రమే యౌషధ ముండును.

౬ వ. చూర్ణమును బుచ్చుకొనుట వలన గుణము గనుపడని యెడల ౨-3, వ. చూర్ణ ములను సేవించ వలయును. కాని దీర్ఘజాడ్య మైన యెడల ౧౨ వ. 3౦ వ. చూర్ణము లను దినవలయును. వానివలనగూడ గుణము గనుపడని యెడల ౬౦ వ. ౧౦౦ వ. ౨౦౦ వ. చూర్ణములను సేవించ వలయును. అప్పు డేదియో యొకచూర్ణమువలన గుణము కనుపడి తీరును.

గృహౌషధయోగమునకు, 3 వ. చూర్ణము

గాని, ఉమ. చూర్ణమును గాని, యుంచుకొనిన జాలును.

ఈ లవణములను వాడు విధమును గూర్చి డాక్టరు, యు. యం. సామంత. ఎల్ ఎం యస్. అను వారు తమ యనుభవము నీ క్రింది విధముగ వ్యక్తీకరించి యున్నారు.

"మలేరియా జ్వరమున్న ప్రదేశము నుండి, పది వత్సరముల వయసుగల యొక బాలిక కలకత్తాకు వచ్చెను. కలకత్తాకు వచ్చిన కొలది దినములలో నా బాలిక రక్త బంక విరేచనముల వలన బాధ పడ జొచ్చెను. రాత్రింబవళ్లు, డెబ్బది విరేచనము లగు చుండెను. ఆ బాలిక మలేరియా జ్వరమున్న ప్రదేశము నుండి వచ్చుట వలన, రక్త బంక విరేచనములు మలేరియా జ్వరము వలన గలిగిన వని యెంచి నెట్రంసల్ఫు ఉమ. చూర్ణమును వాడ సాగితిని. గుణము కనుపడ లేదు. ౫-౪-౩-౨-

౧ మ. చూర్ణములను వాడితిని. కాని లాభము లేకుండెను. తిరిగి ౩౦-౬౦ మ. చూర్ణముల వాడితిని. అందువలనను గుణము గనుపడలేదు. చివరకు ౨౦౦ మ. నెట్రంసల్ఫును వాడినయరగంటకు విరేచనములు గట్టుకొనెను. ఒకటి రెండు దినములలో నాబాలిక యారోగ్యమును బొందెను.”

“ఒక స్త్రీ ప్రసవానంతరము రక్త బంక విరేచనముల వలన బాధపడజొచ్చెను. ఆమెకు నెట్రంసల్ఫు ౨౦౦మ. చూర్ణమును వాడితిని. కాని గుణము గనుపడలేదు. ౩ మ. నెట్రంసల్ఫును వాడినంత నేవిరేచనములు గట్టుకొనెను.”

## మోతాదు

మోతాదుకు ౫ గ్రైనులు గాని, ఆలెక్క తెలియనప్పుడు, అర్ధరూపాయ మీద బట్టినంత మందును గాని, పెద్దలకును, అందులో సగము పిల్లలకును, నాల్గవ వంతు శిశువులకును

వాడవలయు నని కొంతమంది డాక్టరులు చెప్పి యున్నారు. కాని మందును, నెక్కువగ బుచ్చు కొనుట వలన బ్రయోజనము లేదు. అది శరీర మం దిమడక మూత్ర పురీషములనుండి వెలు పలకు వచ్చును.

కావున పెద్దలకు ౧ గ్రైయిను మందును (కందిగింజ యంత) చిన్నలకు అరగ్రైయిను మందును, శిశువులకు గ్రైయినులో నాలుగవ వంతు మందును వాడవలయును. ఒకటి రెండు మందు లుపయోగింప వలసి వచ్చినప్పుడు, ఔషధ పరిమాణమును తగ్గించుట మంచిది. ఈ లవణముల నెక్కుడుపరిమాణమును బుచ్చు కొనుట కంటె, తక్కువ పరిమాణమును బుచ్చు కొనుట వలననే గుణము గనుపడును.

భోజనమున కరగంట ముందును, భోజనానం తరము రెండుగంటల వఱకును నీ మందును బుచ్చుకొన గూడదు.

జాడ్యము తీవ్రముగ నుండినప్పుడు, ౫-౧౦ ౧౫ నిముసములకు గూడ మందు బుచ్చుకొన వలసి వచ్చును. అప్పుడు భోజనమునకు ముందు వెనుక లను నియమము లేదు. బాగుగ గడిగిన సీసాయందు, ౧౦-౧౫ గ్రెయినుల మందును వేయవలయును. కాచిన వేడినీటి నందు బోయవలయును. దానికి మంచి బిర డాను బెట్టి యా మందును ద్రాగుచుండుట యుత్తమము. కాని యొకదినమున సిద్ధముచేసిన మందును, మరుదినమున కుపయోగించుటకంటె. ఏదినమున కా దినము మందును తయారుచేసి పుచ్చుకొనుట మంచిది.

ఈ చూర్ణముతోడ సిద్ధముచేసిన మాత్ర లుండును. ఆ మాత్ర యొక గ్రెయినుండును. కావున గృహస్థు లట్టి మాత్రలను వాడుకొ నుట యుత్తమము. ఏల యన? సులభము.

జ్వరము, దగ్గు మొదలగు తరుణవ్యాధు

లకు ౨-3 గంటల కొకమారు మందు నీయ వలయును. కొంతమందికి నుదయమున రెండు మారులును, సాయంత్రము రెండుమారులును మందిచ్చిన జాలును.

ప్రాణహానిని గలిగించు, కలరా, శూల నొప్పి, మొదలగు జాడ్యములకు ౫-౧౦-౧౫-30 నిముసముల కొకమారు మందీయవలసి వచ్చును. చూర్ణమును నోటియందు వేసికొని వేడి నీటినిగాని, చలి నీటినిగాని త్రాగవచ్చును. ఉష్ణజలమందు గాని, చలినీటియందుగాని మందును గలిపి త్రాగవచ్చును.

మోతాదుకు ఉద్ధరిణెడు, లేక రెండుద్ధరిణెల నీటికంటె నెక్కువ గలుపగూడదు. త్రాగగూడదు.

దగ్గు, పడిసెము, శూలనొప్పి మొదలగు వానికి వేడినీళ్లయందు మందును గలిపి త్రాగ వలయును.

పరిశుభ్రమగు నీరు దొరకనియెడల, చూర్ణమును దినిన జాలును. కాని యపరిశుభ్రమగు నీరును త్రాగగూడదు.

మాటిమాటికి బుచ్చుకొనవలసివచ్చినప్పుడు ఒక్కమారు మందును సీసాయందు గలిపి యుంచుకొని దానిని త్రాగుచుండుట మంచిది.

మ్యాగ్నేసియా ఫాస్‌ను, వేడినీళ్లతో గలిపి త్రాగవలయును. అప్పుడే యది బాగుగ పని చేయును.

## ఒక చూర్ణమందు మరియొక చూర్ణమును గలుపగూడదు

ఈ లవణములలో రెండు మూడు చూర్ణములను గలిపి పుచ్చుకొనుటవలన నేవిధమగు హానియు లేదు. కాని కలుపక విడివిడిగా బుచ్చుకొనుటయే యుత్తమము. గొప్పడాక్టరులలో కొందఱీ మందులను గలిపి పుచ్చుకొను

టను నిషేధించియున్నారు. కావున మందులను గలుపకుండుటయే మంచి దని తోచుచున్నది. అంతగా గలుపవలసి వచ్చినయెడల రెండుమం దులకంటె నెక్కువ కలుపరాదు. అప్పుడు దేని కది పనిచేసిన చేయవచ్చును.

## బాహ్యప్రయోగము

ఈ మందులను లోపలికి బుచ్చుకొనుటయే గాక, శరీరమునకు పట్టించవలసి యుండును. కురుపులు మొదలగువానిని నీళ్లతో గడుగ వలసివచ్చినప్పుడు 3 వ. చూర్ణమును వాడ వలయును.

(౧) చూర్ణము:—శరీరమం దెచ్చట నయిన దెబ్బ తగిలినను, కోసికొనిపోయినను, గంటు వడి రక్తము గారుచున్నను, ఫెరంఫాస్ 3 వ. చూర్ణమును నచ్చట వేసి కట్టు కట్టవలయును. అందువలన నది నయమాగును. కాని కంటిలో

నుపయోగించుటకు మాత్రము ౬ మ. చూర్ణ మునకు, తక్కువసంఖ్యలను వాడగూడదు.

(౨) గాయములు, పుండ్లు గడుగుటకు:—3 మ. చూర్ణము లేక, మాత్రలను, ౧౫ గ్రయినులను, ఆఱు అవున్సుల యుష్ణజలమందు గలిపి గజ్జి తీట మొదలగువానికి పూయవలయును. గాయములు పుండ్లు గడుగవలసి వచ్చినయెడల ౧౫-౨౦ గ్రయినులమందును, రెండు మూడు పౌనుల నీటియందు గలిపి ఆ నీటిలో ముంచిన గుడ్డ, లేక, దూదితోడ పుండ్లు గడుగ వలయును.

(3) స్నానము:—౨౦-3౦ గ్రయినుల మందును, ౫-౬ సేర్ల వేడి నీటియందు గలిపి, ఆ నీటి తోడ స్నానము చేయవచ్చును. దీర్ఘ జ్వరములకును, పలువిధము లగు చర్మరోగముల కట్లు చేయుట యుత్తమము.

(౪) గ్లిసరైనుతో కలుపుట:—౧౦-౧౫ గ్రెయినుల ౩వ. చూర్ణమును, ఒక యవున్సు గ్లిసరైను నందు గలిపి, దానిని కొంచెము వెచ్చ చేసిన యెడల దానియందు మందు బాగుగ గలియును. దానిని బాహ్యప్రయోగమున కుప యోగింపవచ్చును. ఇటులే మందును, వాస లైనునందుగాని, నేతియందుగాని గలుపవచ్చును.

ముఖ్యముగ గమనించవలసిన విషయములు

(౧) ఈ గ్రంథమం దంతటను, ౩-౬ వ. చూర్ణముల నుపయోగించవలయు నని చెప్పి యున్నాము. ఆ మార్గముల వలన గుణ మీ యని యెడల ౧౨-౩౦-౬౦-౧౦౦-౨౦౦ వ. చూర్ణములను గూడ వాడ వలయును.

(౨) ఈ చూర్ణములను, లోహపాత్రల యందు వేయగూడదు. సీసాలనుండి మందును దీయునప్పుడు, గ్లాసు చెమచాలను, లేక, కొమ్ముతో చేసిన పుడకలను, కొయ్య పుడక

లను మాత్రమే యుపయోగించ వలయును. ఇనుము, ఇత్తడి మొదలగు లోహములతో చేసిన వాని నుపయోగింప రాదు. గ్లాసు పాత్రలను మాత్రమే మందును ద్రాగుట కుపయోగించ వలయును. మరియు, పరిశుభ్రమగు తెల్లని కాగితముల యందు మాత్రమే మందును పొట్లములు గట్ట వచ్చును.

---

# ద్వితీయ ప్రకరణము



## పార్థివ లవణములు ; ఉపయోగించు పద్ధతులు

## (౧) క్యాలికేరియాఫ్లోరికా

(క్యాలికేరియాఫ్లవరు)

ఈ లవణము శరీరమందలి యెముకల పైన నుండునట్టి యావరణయందునను, దంతముల మీదనుండు (ఏనామిలు) నట్టి యావరణయందునను, గనుపడుచుండును. ఇది సన్న నినరములు, చర్మము మొదలగు వానియందు నుండును. ఈపార్థివలవణము తరుగుటవలన నరములు బలహీనములై రక్తనాళములు చెడిపోవును. ఈ క్రింద వివరించిన వ్యాధులు గలుగును.

మస్తకము:—మన స్సెప్పుడును సంశయముగను, చంచలముగను, అధైర్యముగను,

నుండును. అకారణముగ ధనము పోవునను భయము,ధనమునుగూర్చిన మనస్తాప ముండును. తలతిరుగుట - అందువలన తలనొప్పి - తలయదురుట - నిద్దుర లేకుండుట మొదలగునవి సంభవించును. మధ్యాహ్నము తల నొప్పివచ్చును. సాయంత్రమున కది తరుగుచుండును.

కండ్లు:—కండ్లయెదుట నేదయిన కదలుచుండు వస్తువునుగాని, కాంతితోడ గూడిన వస్తువునుగాని పెట్టినయెడల నది మెఱపుతీగవలె గనుపడుచుండును. క్రమక్రమముగ దృష్టిశక్తిలోపించి కొందఱు గుడ్డివాండ్రగుదురు. కొంచెముసేపు చదివినను, లేక దేనినైనను జూచుచుండినను, కండ్లు మూతలు పడును. ఒకటి రెండు నిముసములు కండ్లు మూసికొనిన యెడల తిరిగి బాగుగ కనుపడుచుండును.

చెవులు:—చెవులయందు, పలువిధము లగు రోగములు పుట్టుచుండును. శ్రవణేంద్రియమం

దొకవిధ మగు మైల లేక గుబిలి పెరుగును. అందువలన చెవుడు వచ్చును. చెవులకు నలు వైపులనుండునట్టి యెముకలు తీపుగనుండును.

ముక్కు:—నెత్తురుగారును. చీమిడి గట్టిపడి యది వెలుపలకువచ్చుట కష్టమగును. ఒకప్పుడది వెలుపలకు రాక గొంతులోనికి పోవుచుండును.

**ముఖము:**—దౌడయెముక లుబ్బి, మిక్కిలి తీపుగానుండును.

పండ్లు:—పండ్లమీదనుండు మెఱుపు పదార్థము నశించును. పండ్లు కదలును. దంతములు తీపుగనుండును. పండ్లు పుచ్చిపోవును. ఒకప్పుడు బాధ లేకుండగనే పండ్లు కదలుచుండును. చిగుళ్లు వాచును.

నోరు:—పెదవులు పగులును. వాని మీద చిన్న పొక్కులు లేచును. లోపలిదౌడయందు కురుపులు లేచును. గొంతు, ఎండుకొనిపోవు

జీర్ణకోశము:— తరుచుగ వమనమగుచుండును. విరేచనబద్ధకము గలుగును. మూలశంక బుట్టును. దానితోడ రక్తము కారుచుండును. ఋతుస్రావము మిక్కుటముగ నగును.

శ్వాసయంత్రము:— దగ్గు, క్షయ దగ్గు, పుట్టును. దగ్గుతోడ మిక్కిలిగ శ్లేష్మము పడుచుండును. గొంతు నొప్పిగను, మంటగనుండును. ఊపిరి విడుచునప్పుడు బాధగనుండును.

చేతులు, కాళ్లు:— కాలివ్రేళ్లు, చేతుల వ్రేళ్లు తీపుగానుండును. ఉబ్బును. కీళ్లువాచును.

జ్వరము:—దాహముతో గూడిన జ్వరము వచ్చును. అప్పుడు నాలుక, ఎండుకొని పోవుచుండును. నిద్ర లేకుండును. చీకాకుగానుండును.

మోతాదు:—ఈ లవణమును సాధారణముగ ౬ వ. చూర్ణమును బుచ్చుకొనవలయును. డాక్టరు శిశిలరు ౧౨ వ. చూర్ణమును బుచ్చుకొను చుండవలయునని చెప్పియున్నాడు. కాని

యెడల, అతిశీఘ్రముగ వారి శరీరము వృద్ధి యగుటయేగాక, బలిష్ఠమగును. వృద్ధులకును, వ్యాధినుండి విముక్తులయినవారికిని, ఈలవణము నిచ్చుచుండినయెడల, దుర్బలత్వమును బోనడచి, వారి శరీర పునర్నిర్మాణమునకు మిక్కిలిగ దోడ్పడును.

ఈ లవణము తరిగిపోవుటవలన నీ క్రింద వివరించిన వ్యాధులు గలుగును.

మస్తకము:—మన స్సెప్పుడును విచారముగ నుండును. భయముండును. జ్ఞాపకశక్తి లోపించును. ఏకాగ్రచిత్తము లేకుండును. అతి కోపము - మాంద్యము - ఏమియు తోచకుండుట, మొదలగు గుణములు గనుపడుచుండును. తల తిఱుగుచుండును. మెదడునందు శీతము గ్రమ్మినటులుండును. యౌవనకాలమం దెప్పుడును తలనొప్పి యుండును. వెంట్రుకలు బాగుగ

నెదుగవు. మఱియు, వెంట్రుకలు రాలిపోవు చుండును.

నేత్రములు, శ్రోత్రములు:—కన్ను లెఱ్ఱ బడును. బాధగా నుండును. బాలకులకు, యువకులకు, పలువిధము లగు కంటిరోగములు గలుగుచుండును. కన్ను లదురుచుండును. వెలు తురును జూడజాలరు. చెవుల చుట్టు నుండునట్టి ఎముకలు తీపుగ నుండును. చెవులయందు శీత లము గ్రమ్మినటులుండును.

ముఖము:— వికాసరహితమై యుండును. చిరుచెమటలు గ్రమ్ముచుండును. పాలిపోవును. బాధగానుండును. కుడిచెంపనుండి యెడమ చెంపకు, నొప్పివచ్చుచుండును. పెదవులుగట్టిపడి తీపుగనుండును. ఈ లవణము తరుగుటవలన నే సమస్తవిధము లగు పండ్లవ్యాధులు గలుగు చున్నవి.

నాలుక:—నాలుక చేదుగను, అసహ్యము గను, మొద్దుగను పుండయినటు లుండును. నాలుకచివర పొక్కులు లేచును. రుచి తెలియదు. దాహము లేకున్నను నోరెండుకొని పోవుచుండును.

గొంతు:—గొంతు పచ్చిపుండువలె నుండును. ఉమ్మివేయునప్పుడు బాధకలుగును.

ఊపిరితిత్తులు:—ఊపిరితిత్తులు చలువగను, ఎడమవైపు రొమ్మునందు శూల నొప్పియు బుట్టును. శ్వాస విడుచునప్పుడు బాధ గలుగును. హృత్కంపము క్షయదగ్గు మొదలగునవి పుట్టును. ఉపన్యాసము లిచ్చువారెప్పుడీ లవణమును సేవించుచుండుట మంచిది.

జీర్ణకోశము:—కడుపునందు మంట, ఆకలి లేకుండుట, మిక్కిలియాకలి, భోజనానంతరము కడుపునొప్పి, మొదలగునవి గలుగును.

ప్రస్రావము, జననేంద్రియము:—బాలురు నిద్దుర తెలియక శయ్యయందు మూత్రమును విడచుచుందురు. వృద్ధులు మూత్ర వేగధారణ యందసమర్థులగుదురు. అతిమూత్ర వ్యాధి కలుగును. కొంతమందికి మూత్రావరోధమగును. మూత్రకోశమందు రాళ్లు పుట్టును. నంజురోగము వచ్చును. స్త్రీలకు నియమముదప్పి మిక్కుటముగ ఋతుస్రావమగుచుండును. ముట్టు కుట్టు నొప్పి యుండును. మూత్రకోశమందు మంట ఉండును.

శిశువులకు పాలిచ్చుటవలన గలుగు దుర్బలత్వమునకీ లవణము నీయవలయును.

కాళ్లు, చేతులు:—కాళ్లు చేతులు శీతలము గ్రమ్మినటులుండును. వణకుపుట్టును. వ్రేళ్లుకాళ్లు తీపుగనుండును. కాళ్లుచేతులు సన్నగిలిపోవును. మరియు నెప్పుడును లాగికొని పోవుచుండును. నడుము బిగిసికొని పోవును. వాతము వలన

నడుము బిగిసికొని పోయినయెడల ఫెరంఫాస్‌ను సేవించిన పిమ్మట దీనిని బుచ్చుకొనవలయును. కాళ్లు చేతులనుండి చెమట గాఱుచుండును. కాళ్లు వంగిపోవును. హస్తపదములు నియమము లేక బెరుగుచుండును.

నరములు:—ఇది నరములయందు మిక్కిలిగ నుండును. కావున బలహీనమొనర్చు వ్యాధులు నయమైన పిమ్మట నీ లవణమును సేవించవలయును.

నిద్దుర:—ఉదయమున నేనిద్దుర మెలకువరాదు; గాఢనిద్ర యుండదు. స్వప్నములతోడ నే నిద్దుర పూర్తి యగుచుండును. మత్తుగ నుండును. పిల్లలు రాత్రులందు రోదనము చేయుచుందురు.

చర్మము:—శరీరమంతయు మంటగనుండును. చేతుల పైభాగ మెండినటులుండును. గజ్జిమొద లగు కురుపులు లేచును.

మోతాదు:—పిల్లలకు పండ్లువచ్చునప్పుడు 3 మ. చూర్ణమును, రోజుకు రెండుతూరుల

చొప్పున పండ్లు వచ్చునంతవఱ కిచ్చుచుండవల యును. సాధారణముగ 3 మ. ౾ మ. చూర్ణ ములను వాడుకొనుచుండవలయును. తరుణ వ్యాధులకు రోజుకు ముమ్మారీ మందు నీయ వలయును. వృద్ధులకు ౧౨ మ. చూర్ణము నిచ్చుట మంచిది.

## (3) క్యాలికేరియా సల్ఫ్యూరికం

(క్యాలికేరియా సల్ఫు)

ఈ పార్థివలవణము లోపించుటవలన నీ క్రింది రోగములు పుట్టుచుండును.

మస్తకము:—పిల్లల తలమీద కురుపులు - నోటియందు పూత - నోరంతయు వ్రణముగ నుండును. కురుపులు, గజ్జికురుపులు లేచును. ఈ లవణము లోపించుటవలననే సమస్తవిధము లగు పుండ్లు పుట్టుచుండును. చలిగాలి తగిలి

ముక్కు వెంట నీరు గారును. నాసికారంధ్రములు పుండుగ నుండును.

నిశ్వాస ప్రశ్వాసయంత్రము:—కళ్లెదగ్గు, క్షయదగ్గు పుట్టును. గొంతు బొంగురుపోవును. జ్వరము వచ్చును. జ్వరముతోడ దగ్గుండును.

కాళ్లు, చేతులు:—వాతమువలన నడుము బిగించుకొనిపోవును. కాళ్లు తీపులుగ నుండును. వ్రేళ్లు కొంకర పోవుచుండును. కీళ్ల నొప్పు లుండును. కుడికాలు బిరుసెక్కును. అందు వలన మిక్కిలి తీపు గలుగును. నడిచిన కాళ్లు వ్రేళ్లు మంటగ నుండును. ఆయాసము వచ్చును. రాత్రులు నిద్దుర పట్టదు.

మోతాదు:—తరుణ వ్యాధులకు ౩ వ. చూర్ణ మును రెండుగంటల కొకమారు ఈయవలయును. దీర్ఘ వ్యాధులకు దినమునకు ముమ్మారిచ్చిన చాలును. ఈ మందును సేవించు నప్పుడు చలి గాలియందు తిరుగకూడదు.

## (8) ఫెరంఫాస్ ఫ్స్యారికం

(ఫెరంఫాస్)

ఈ లవణము శరీరమం దన్ని భాగములయం దుండును. కాని ముఖ్యముగ రక్తమం దెక్కుడు గనుండును. రక్తనాళములయం దిది తరుగుట వలన, నాళములు చెడిపోవును. అందువలన నాళములయందు రక్త మెక్కుడగుటగాని, రక్తస్రావముగాని గలుగును. ఈ లవణమును దినుటవలన రక్తనాళములయందు గుండ్రని బిళ్లలవలె నుండు కణములు వృద్ధినొంది, దృఢ పడును. అందువలన, రక్తసంచలనము యథా స్థితికి వచ్చును. జ్వరములు పోవును. దుర్బలత్వ మునకును, ఆకలి మందగించుటకును, చికిత్సగా వీనిని వాడవలయును.

మస్తకము, ముఖము:—ఇది తరుగుటవలన తలయం దెక్కుడుగ రక్తము చేరును. అందు

వలన తలనొప్పి గలుగును. తల భారముగ నుండును. తల యదురుచుండును. ముఖము, ఎఱ్ఱగను, ఉత్తప్తముగ నుండును. తల వెనుక నుండి ముందునకు పోట్లుండును. దంతములు వచ్చునప్పుడు జ్వరము వచ్చును.

కండ్లు:—కండ్లుబ్బును. ఎఱ్ఱపడును. కంటి యందిసుక పోసినటు లుండును. ఆటలమ్మ, పొంగు వచ్చినప్పుడు కండ్లుబ్బును. వెలుతురును జూడజాలరు.

నాసిక, కర్ణములు:—ముక్కువెంట నెత్తురు కారుచుండును. చెవులు దిబ్బళ్లువేయును. గింగురుమనుచుండును. రక్తాధిక్యతవలన చెవుడు వచ్చును.

గొంతు :—గొంతు, ఎండుకొని పోవుచుండును. ఎఱ్ఱగను, తీపుగను, నుండును.

జీర్ణకోశము:—అతిదాహముండును. రక్తవమన మగుచుండును. తిన్న పదార్థములను

కక్కుకొనుచుందురు. అజీర్ణ విరేచనములు, మూలశంక, రక్తవిరేచనములు పుట్టును.

మూత్రము:—నిద్దుర తెలియక పక్క మీద మూత్రము విడుచుట సంభవించును. మిక్కిలి తరుచుగ మూత్రమును విడువవలసి వచ్చుచుండును.

స్త్రీజననేంద్రియము :—అల్ప వయసుననే ఋతుస్రావ మగును. నియమము దప్పి ఋతు వగుచుందురు. ఋతుస్రావపరిమాణము మిక్కిలిగ నుండును. కొందఱకు ఋతుస్రావ మత్యల్ప ముగ నగుచుండును.

శ్వాసకోశములు:—జ్వరముతోడ తీవ్రమగు దగ్గు, రొమ్ములయందు మంట - పోట్లుండును. దగ్గునప్పుడు హఠాత్తుగా మూత్రములేక అపాన వాయువును విడుచుచుందురు. దగ్గునప్పుడు రక్తముతో గూడిన కఫ్లై పడును. స్వరభంగము గలుగును. సంగీతము పాడినను, బిగ్గఱగ జదివి

నను గొంతు బొంగురుపోవును. దగ్గు-కోడ వమన మగుచుండును.

**నడుము, కాళ్లు, చేతులు:**—నడుము వాతము వలన బిగిసికొనిపోవును. శరీరమునం దచ్చటచ్చట నొప్పు లుండును. కాలివ్రేళ్లయందు మంట - కుడిచేయి మొద్దుగా నుండుట - అరచేతులు వేడిగా నుండుట - కీళ్లనొప్పులు - వాతనొప్పులు మొదలగువ్యాధులు గలుగును.

నిద్ర:—బాగుగ నిద్రపట్టదు. పగలు మత్తుగను, శరీరము బరువుగ నుండును. కూర్చుండి నిద్దురపోవుట సంభవించును.

మోతాదు:—తరుణవ్యాధులకు ౬ మ. చూర్ణమును గోరువెచ్చని నీటియందు గలిపి తఱుచుగ నీయవలయును. పిమ్మట ౧౨ మ. చూర్ణమును వాడుచుండవలయును. ౩ - ౬ మ. చూర్ణముల నిచ్చినప్పుడు నిద్రపట్టనియెడల ౧౨ మ. సంఖ్యకు తక్కువ సంఖ్యను వాడ గూడదు.

## (౬) క్యాలీ మూర్యాటికం

(కాలీమూరు)

ఈలవణము, రక్తము, నరములు, మాంసము మొదలగువానియం దుండును. నాలుకమీద, తెల్లనిపదార్థము చేరినను, మఱి యెచ్చటనుండి యైనను, శ్వేతపదార్థము నిస్రుతమైనను నీ లవణమును సేవించవలయును. అమాశయము, నిమోనియా, మొదలగు వ్యాధుల కీ లవణమును బుచ్చుకొన వలయును.

శరీరమం దీ లవణము తగ్గుటవలన నీ క్రింద వివరించిన వ్యాధులు గలుగును.

**మనస్సు:**—అకారణమగు చింతయు, ఆనందమును గలుగుచుండును. సాయంసమయమున మిక్కిలి విచారముగ నుండును. తెల్లవారు జామున కలలువచ్చును. గాఢనిద్దుర పట్టదు.

**మస్తకము:**—తలనొప్పి యుండును. దానితోడ వాంతులగుచుండును. చెవియందు పోటు

బుట్టును, మరి చీముగారును. అందువలన చెవుడు వచ్చును. నాలుకమీదను, నోటియందునను పుండ్లుపడును. నాలుక దట్టముగను తెల్లగను నుండును.

గొంతు:—గొంతు నొప్పిగనుండును. పుండ్లు లేచును. పొడిదగ్గు వచ్చును. ఊపిరి విడుచునప్పుడు ఆయాసముండును. గొంతు బొంగురుపోవును. నోటివెంట నీళ్లుకారును. గొంతుసంబంధమగు వ్యాధు లన్నిటికి నీ చూర్ణమును తినినయెడల గుణమిచ్చును.

జీర్ణయంత్రము:—అజీర్ణవ్యాధితోడ నాలుక తెల్లగా నుండును. చమురుతో ఉడికిన పదార్థము లఱుగక కక్కులు వచ్చును. కామెర్లు, మూలశంక, రక్తబంక విరేచనములు, కడుపునొప్పి మొదలగు వ్యాధులు గలుగును. కళ్లెతోడ నెత్తురు పడుచుండును. ఆకలి మందగించును.

ప్రస్రావము, జననేంద్రియము, మలము:— మూత్రాశయము వేడిగానుండుట, ఆలస్యముగ ఋతుస్రావమగుట, తెల్లబట్ట యగుట, గర్భిణి స్త్రీలు కక్కుకొనుట, మొదలగు రోగములు బుట్టును. మలము పసుపుగను, బంకమట్టివలెను జిగటతోడ గట్టిగ నగుచుండును. ఆసనముకడ నొప్పిగ నుండును. తెల్లవిరేచనము లగుచుండును. అతిమూత్రము- నంజు - పచ్చసెగరోగము వీర్య నష్టము - కొరుకురోగము - సవాయిరోగము- మొదలగు వ్యాధులు గలుగును.

శ్వాసయంత్రము:—స్వరభంగ మగును. దగ్గు వచ్చును. దానితోడ శ్లేష్మము పడుచుం డును. క్షయ దగ్గు - నిమోనియా మొదలగు రోగములు పుట్టును. నిమోనియాకు, ఫెరం ఫాస్‌తోఁ గలిపిగాని, పర్యాయక్రమముగాఁ గాని యీ మందును వాడవలయును.

కాళ్లు, చేతులు, నడుము:— వాతమువలన

కీళ్ల నొప్పులు గలుగును. అవి కదలినప్పుడును రాత్రులందును వృద్ధి యగుచుండును.

త్వక్కు:—చర్మవ్యాధు లీ లవణము లే కుండుటవలన గలుగుచున్నవి. స్ఫోటకము - ఆటలమ్మ - పొంగు - రాచకురుపులు - మేహ వ్రణములు-జ్వరములు-టయిఫాయిడ్ జ్వరము-సంధిగుణము-మొదలగు రోగములు వచ్చి నపు డీ చూర్ణమును దినుటవలన మేలు గలుగును.

మోతాదు :—సాధారణముగ నీ చూర్ణమును ౨-౩-౪-౫-౬ వ. లను వాడుచుండవలయును.

## (౬) క్యాలీ ఫ్యాస్ఫారికం

### (కాలీఫాస్)

శరీరమందలి, రసములు - రక్తమునం దిది-సాధారణముగను మస్తిష్కము, నరములయం దెక్కుడుగ నుండును. శరీరమును కుళ్లిపోకుం

డగను, క్షీణింపకుండగను నిది గా పా డు చుండును. ఇది లోపించుటవలన నరముల సంబంధ మగు వ్యాధులు గలుగును.

మస్తిష్కము:—ఉద్వేగము, భీతచిత్తము, మస్తిష్కశూన్యము, నిరుత్సాహము, చిరాకుగా నుండుట, జ్ఞాపకశక్తి లోపించుట, నరముల దుర్బలత్వము, ఇష్టీరియా, మొదలగు రోగములు గలుగును. విద్యార్థులకు తలనొప్పి, సామాన్యశబ్దమును వినినంతనే గందరగోళముగ నుండుట సంభవించినప్పుడు, క్యాలికేరియా ప్లవరును వాడినతర్వాత నీ చూర్ణము ౨ మ. ను వాడవలయును.

జీర్ణయంత్రము:— నాలుక యెండుకొని పోవుచుండును. నాలుకచుట్టు నలుపగును. పుండ్లుపడును. పల్లుచిగుళ్లనుండి రక్తము కారుచుండును. తీపిపదార్థములయందు మిక్కిలి ప్రీతియుండును. ఎంత దినినను ఆకలి తీరదు.

అతిదాహ ముండును. వమనము వచ్చునటు లుండును. కక్కు లుండును. దానితోడరక్తము గూడ బడుచుండును. కడుపునొప్పి - ఉదరామము - అజీర్ణము - కడుపునందు మంట - మొదలగు రోగములు గలుగును. మలము మిక్కిలి నలుపుగ నుండును. మఱియు రక్తయుతమై దుర్గంధముతోడ గూడుకొని యుండును.

నడుము, కాళ్లు, చేతులు:—కాళ్లుచేతులు లాగుకొనిపోవుచుండును. కీళ్లనొప్పు లుండును. పక్షవాతము గలుగును. దుర్బలత్వ మేర్పడును. ఇవి యన్నియు శీతకాలమందు వృద్ధి యగుచుండును.

శ్వాసయంత్రము:—నిశ్వాస ప్రశ్వాసలు భారముగ నుండును. స్వరభంగము గలుగును. మూర్ఛరోగము వచ్చును. హృదయస్పందనము మిక్కుట మగును.

అల్పాచమానము:—పిల్లలు పక్కమీదనే మూత్రమును విడుచుచుందురు. ఈ జాడ్యమునకు మిగిలిన యౌషధములు పట్టినప్పుడీ లవణమును వాడవలయును. తప్పక గుణము గనుపడును. వార్ధక్యమందు మూత్రము నెక్కువగ విడువవలసి వచ్చుచుండును. అతి మూత్రవ్యాధి గలుగును. అల్పవయసునందే ఋతుస్రావము మిక్కుటముగ నగుచుండును. మఱియు నది మిక్కిలి దుర్గంధయుతమై యుండును. ఋతుకాలమున తలనొప్పి యుండును. ఎప్పుడును నిద్రపోవలయు నని తలంచుచుందురు. పిల్లలు నిద్రపట్టక యేడ్చుచుందురు. భయపడుచుందురు. ఉదయముననే నిద్దుర మెలకువకు రాదు. వచ్చినను పక్కనుండి లేచుటకు మిక్కిలి కష్టముగ నుండును.

చర్మము:—మిక్కిలి దురదగా నుండును. టయిఫాయిడ్డు జ్వరము వచ్చినప్పుడును, నాలుక

యెండినప్పుడును, నాడి తగ్గినప్పుడును, దీనిని వాడవలయును. అన్ని విధము లగు జ్వరముల కిది మంచిమందు.

మోతాదు:— ఈ లవణమును తక్కువ నెంబరులనే వాడవలయును. అనగా, ౧-౨-౩-౪-౫-౬ వ. చూర్ణములను వాడుచుండ వలయును. అవసరమును బట్టి యెప్పుడయినను ౧౨ వ. చూర్ణమును గూడ వాడవచ్చును. దీనిని తరుణవ్యాధులకు గంట కొకమా రీయ వలయును. దీర్ఘ వ్యాధులకు దినమునకు ముమ్మారు పుచ్చుకొనిన జాలును.

## (౭) క్యాలీ సల్ఫ్యూరికం

(కాలీసల్ఫ)

చర్మము, శ్లేష్మ కోశములయం దీ లవణము మిక్కుటముగ నుండును. ఏ వ్యాధియైనను, సాయంత్రపుపూట నెక్కువగ నుండి, గాలి

యందు దిరిగిన హాయిగ నుండినయెడల దీనిని సేవించవలయును. ఇందువలన నా వ్యాధులు నయమగును. ఈ లవణము లోపించుటవలన నీ క్రింద వివరించినవ్యాధులు గలుగును.

మస్తకము:—పలువిధము లగు తలనొప్పులు గలుగును. గాలిరానిగృహమం దుండి నప్పుడు గాని సాయంత్రము గాని తలనొప్పి వృద్ధి యగు చుండును. తలమీాద పుండ్లు లేచును. వెండ్రుక లూడును. ముక్కునుండి నీరు కారును. ఆనీరు దుర్గంధయుతమై యుండును.

జీర్ణయంత్రము:—మిక్కిలి దప్పికలిగి యుం డును. పాకస్థలియందుజలుబు చేయుటవలన దాని తోగూడ నాలుక హరిద్రవర్ణముగ నుండును. గట్టిపడును. మలినావృతమై యుండును. జీర్ణ యంత్రము బరువుగ నుండునట్లు దోచును. వేడినీళ్లు ద్రావినయెడల మిక్కిలి కష్టముగ నుండును. కడుపునొప్పి, మలబద్ధక ముండును.

అల్పాచమానము - జన నేంద్రియము:—పచ్చ సెగరోగము పుట్టును. ముట్టయినప్పుడు పొత్తికడుపు నొప్పిగ నుండును. క్రమముదప్పి ఋతుస్రావ మగుచుండును.

శ్వాసయంత్రము:—ఉబ్బసపుదగ్గువచ్చును. జలుబు చేయుచుండును. మరియు నివి గ్రీష్మకాలమందు వృద్ధి యగుచుండును. సాయంత్రపువేళ దగ్గు వచ్చుచుండును. ఎదురురొమ్ము నందు దడయుండును. చలిగాలియందు దిఱుగుచుండవలయు నను కోరిక గలుగును. క్షయ దగ్గు పుట్టును. ఊపిరితిత్తు లుబ్బును.

చర్మము:—చర్మక్రియ మాంద్య మగును. గజ్జి పుట్టును. మిక్కిలి దురదయుండును. చర్మముమీఁది పొట్టూడిపోవుచుండును. గోళ్లు బలహీన మగును. శీతపైత్యము గలుగును.

నడుము, కాళ్లు, చేతులు:—కాళ్లు చేతుల యందు తీపుండును. అది యొకచోట గను

పడి కొంతవడికి మరియొక చోటున గనుపడు చుండును. కాని పుట్టినచోట మాత్రము బాధ యుండదు.

మోతాదు:— బాహ్య ప్రయోగమునకు ౧ మ. చూర్ణమును వాడవలయును. ౬ మ. లేక, ౧౨ మ. చూర్ణములను బుచ్చుకొన వలయును.

## (౮) మ్యాగ్నేసియా ఫాస్ఫారికం

## (మ్యాగ్నేసియాఫాస్)

ఇది కండరములయందును, నరములయందును మిక్కుటముగ నుండును. నరములు లాగుకొనిపోవు రోగమున కిది ముఖ్యమగు మందు. ఇది లోపించుటవలన నీక్రింద వివరించిన వ్యాధులు గలుగును.

మస్తకము:—తల నొప్పిగను, పోటుగ నుండును. మానసిక పరిశ్రమవలన తల భార

ముగ నుండును. శీతలముగ నుండును. కన్ను లకు నలుదిక్కుల శూలనొప్పి పుట్టును. కను రెప్ప లదురుచుండును. చెవులయందు పోటు పుట్టును. దంతములు పోటుగా నుండును. పిల్ల లకు పండ్లు వచ్చునప్పుడు పలువిధము లగు రోగములు గలుగును. చిన్నబిడ్డగుణాము గను పడును.

జీర్ణ యంత్రము:—కడుపు నందు మంట యుండును. శూలనొప్పి పుట్టును. అజీర్ణము తోడ, ఉదరామము గలుగును. వెక్కిళ్లు వచ్చు చుండును. తిన్నయన్నము వెళ్లిపోవుచుండును. అన్నివిధము లగు కడుపునొప్పులకు, శూలలకు దీనిని వేడినీళ్లతోడ గలిపి పుచ్చుకొనవలయును. వెంటనే గుణ మిచ్చును. కాళ్లు చేతులయందు వేదన యుండును.

స్త్రీ జననేంద్రియము:—ఋతుస్రావ కాల మందు శూలపుట్టును. ఆ శూల ఋతువునకు

బూర్వమే ప్రారంభమగును. ఋతురక్తము తోడ పలుచని శ్లేష్మము పడుచుండును. నెల కాక మునుపే ఋతువగును. స్రావము మిక్కిలి యెరుపుగ నుండును.

శ్వాసయంత్రము:— గోరింత దగ్గున కిది ప్రధానమగు మందు. రాత్రులు దగ్గు వృద్ధి యగుచుండును. దగ్గునప్పుడు రొమ్మునందు మంట, బాధ యుండును. కడుపులో పుండ్లు, నొప్పులు మొదలగునవి యీ లవణమును సేవించుటవలన నయమగును.

కాళ్లు, చేతులు:—కీళ్లయందు పోట్లు - తీపు లుండును.

మోతాదు :—దీని నెప్పుడును వేడి నీటితోడ బుచ్చుకొనవలయును. అప్పుడే దీనివలనగుణము గనుపడును. సాధారణముగ ౬ వ.చూర్ణమును వాడుకొనుచుండవలయును. శూలనొప్పి తీవ్రముగ నుండినయెడల ౨-౩-ర వ. చూర్ణములను

వాడవలసివచ్చును. బాలకులకు శూలనొప్పి వచ్చినప్పుడు ३०-८० మ. చూర్ణములను వాడుట మంచిది.

## (౯) నెట్రం మూర్యాటికం

(నెట్రం మ్యూరు)

శరీరమందలి పలుచని పదార్థముల యందును, గట్టిపదార్థములయందును ఈ లవణ ముండును. ఈ లవణసహాయము వలననే కోశముల యందు పలుచనిపదార్థము, ఎచ్చుతగ్గులు లేక సరియగు స్థితియందుండును. మరియు నిది, రక్తనాళముల యందును, జీర్ణకోశ మందును, శ్లేష్మకోశమందును మిక్కిలి పనిచేయు చుండును. శిరోవేదన, దంతశూల, కడుపుశూల, మోముశూల, నోటివెంట నురుగుపడుట, కంటి వెంట నీరు కారుట, శ్లేష్మవమనము మొదలగు వ్యాధులు గలుగును. శరీరము నిండ చిన్న

చిన్న పొక్కులు లేచి దానియందు నీటివంటి పదార్థముండిన యెడల ఈలవణమును సేవించ వలయును.

మస్తిష్కము :—ఉత్సాహ విహీనమును, రోగభీతితో గూడిన మనోవ్యాకులత్వమును ఉండును. మస్తిష్కము శూన్యముగ నుండును. తలనొప్పి యుదయమున నెక్కువగ నుండును. మనో దుర్బలత్వము, మరపు ఉండును. మెడ నరములు బలహీన మగును. కండ్లయందు చురుకుచురుకుమని పో ట్లుండుటయే గాక, దృష్టి లోపించును. పడిసెము, తలనొప్పి, తల పోటు, మొగము పాలిపోవుట, అతిదాహము, కుడివైపున పార్శ్వపునొప్పి, తలవెనుక నొప్పి, తలబరువు మొదలగు రోగములు గలుగును.

జీర్ణయంత్రము:—నోటివెంట నీరు కారు చుండును. మిక్కిలి యాకలి యుండును. నిశ్వాస ప్రశ్వాసములు దుర్గంధయుతము

లగును. విరోచన మైనంత నే గుహ్యద్వారమందు మంట యుండును. మలబద్ధకము గలుగును.

మూత్రము :—అనేక మారులు మూత్రమును విడువవలసివచ్చును. మూత్రము విడిచినపిమ్మట స్త్రీ జననేంద్రియము మంటగ నుండును. ఋతుశూల పుట్టును. అందువలన మానసికశక్తి లోపించును.

నడుము, కాళ్లు, చేతులు :— నడుము తీపుగ నుండును. బల్లమీదగాని, అరుగుమీద గాని, వెల్లకిల బరుండినయెడల, నా వేదన తగ్గినటు లుండును. కాళ్ళు చేతులు దుర్బలత నొందును. కీళ్లయందు పోట్లుండును.

మోతాదు :—కొంతమంది 3 వ. మొదలు ౬ వ. చూర్ణము నుపయోగించుటవలన మిక్కిలి మేలు గలుగునని చెప్పుచున్నారు. 30 వ. చూర్ణమునుగాని, యంతకు పైబడిన సంఖ్యలనుగాని వాడుట మంచి దని మరికొందరి

వేదన, ఆమ్లగంధయుక్త మగు, ఉదరామము, ఈ లవణమును సేవించుటవలన నయమగును. ఈమందు, అజీర్ణమును నాశనము జేసి, కడుపు నందలి నులిపురుగులను చంపును. జీర్ణకోశమం దీలవణము తరుగుటవలన నచ్చటనుండు పిత్తము గడ్డకట్టును. అందువలన జీర్ణ మేర్పడుచున్నది. మరియు నీ లవణము లోపించుటవలన నీ క్రింది వ్యాధులు గలుగును.

మస్తకము:—అజీర్ణమువలన తల భారముగ నుండును. ఆమ్లవమనము లగుచుండును.

జీర్ణయంత్రము:—అజీర్ణరోగము పుట్టును. నోటియందునను నాలుకమీదను హారిద్రవర్ణ యుక్తమగు మయల చేరును. పండ్లు తీపుగ నుండును. మోమునుండి యామ్లగంధము వెల్వడు చుండును. కడుపునందు శూలనొప్పి గలుగును. నులి పురుగులు పుట్టును. అందువలనకడుపు మెలి వేయుచుండును. కక్కు వచ్చునటులుండును.

భోజనానంతరము కడుపునొప్పియుండును. గొంతునందు మంటయు, పోటునుండును. నోటి నుండి పచ్చనికళ్లె పడుచుండును.

విశ్వాస ప్రశ్వాసలు:—గుండెలు దడదడ లాడుచుండును. మెట్లెక్కినప్పు డాయాసముగ నుండును. క్షయదగ్గు పుట్టును. అతిమూత్రము, వీర్యనష్టము, వీర్యము పలుచపడుట, మొదలగు రోగములు పుట్టును. ఋతుస్రావము పలుచ గను, నీళ్లవలె నగుచుండును. మరియు నది యామ్లగంధయుతమై యుండును. సకాలమును మించిగాని, సకాలములోగాని ముట్టగుచుందురు. దానితోడ తలనొప్పిగూడ నుండును.

కాళ్లు, చేతులు, నడుము:—కాళ్లు చేతులు దుర్బలమగును. నడచిన, కాళ్లు తీపుగ నుండును. వాతపునొప్పులు, కీళ్లనొప్పులు పుట్టును. ఇట్టి నొప్పుల కిది చాల ముఖ్యమగు మందు.

మోతాదు:—దీనిని ౧౨ వ. చూర్ణమును

సేవించుట యుత్తమము. పిల్లలకు ౬ మ. చూర్ణమును వాడవలయును. సర్వసాధారణ ముగ ౩-౬ మ. చూర్ణముల వాడుచుండవల యును. పురుగు లున్న యెడల ౩ మ. చూర్ణ మును వాడిన శీఘ్రముగ గుణము గనుపడును.

## (౧౧) నెట్రం సల్ఫ్యూరికం

(నెట్రం సల్ఫ)

ఇది కేవలము కోశములయందలి నీటిపదార్థ మందు మాత్రము గన్పడుచుండును. ఈ లవ ణము శరీరమందలి యనావశ్యక మగు జలసం బంధ మగు పదార్థములను దొలగించును. పిత్తాధిక్యతవలన గలుగు సమస్తరోగముల కిది ముఖ్యౌషధము. నాలుకమీాద నుండు మయి లనుబట్టియు, నోటి యరుచివలనను, నీలవణము శరీరమందు లోపించిన దని మనము గ్రహించ వచ్చును.

మస్తకము:—తలనొప్పితోడ పిత్తసంయుక్తమగు, ఉదరామము గలుగును. మస్తిష్కమునకు క్రిందిభాగము మిక్కిలితీపుగానుండును. మనోవ్యాధి గలుగును. నడినెత్తిన యుంట పోటులుండును. దగ్గినప్పుడు నుదురు బ్రద్దలయినటు లుండును. చదువుచుండిన తలనొప్పి గలుగును.

కండ్లు:—కండ్లు మంటగ నుండును. నీళ్లు కారును. రెప్పలచివర మంటలుండును. కండ్లయందు దిసుక బోసినటు లుండును. మసకలు వచ్చును.

జీర్ణయంత్రము:—ఆకలి యుండదు. అతిదాహ ముండును. మాంసాహారమును దినవలయు నను కోరిక యుండును. కడుపునందు శూలనొప్పి పుట్టును. ఆకుపచ్చని పసరును, పులిసిన కల్లెతోడ వాంతు లగుచుండును. నిద్దురనుండి లేవగనే కడుపునందు మంట పుట్టును

వెంటనే యన్నమును దినినయెడల నా మంట తఱిగి పోవును. కడుపునుండి వీపువరకు పోట్లుండును.

అల్పాచమానము:—అతిమూత్రవ్యాధి కిది ప్రధానౌషధము.

శ్వాసయంత్రము:—వర్షాకాలమం దుబ్బసపు దగ్గుపుట్టును. దగ్గుతోడ దట్టమగు శ్లేష్మము పడుచుండును. గుండెలయందు జలుబు చేయును. నిద్దురనుండి లేచినంతనే దగ్గు ప్రారంభమగును.

నడుము, కాళ్లు, చేతులు:—నడుమునొప్పి, వెన్నెముకయందు పోట్లుండును. నడుము బిగబట్టుకొని పోవును. నిద్రించునప్పుడు కాళ్లు చేతులు గదలుచుండును. దినమువిడిచి వచ్చు జ్వరమున కిది ముఖ్యమగు మందు.

మోతాదు:—౬ మ. చూర్ణమును రోజుకు ముమ్మారు బుచ్చుకొనవలయును. మలేరియా

జ్వరమునకు 3 మ. చూర్ణమును, పురాతన వ్యాధులకు 30 మ. చూర్ణమును, దానికి పై బడిన సంఖ్యలను వాడుచుండవలయును.

## (౧౨) సాయిలీసియా

ఇది యెముకలు, చర్మము, గోళ్లు, తలవెండ్రుకలయందెక్కువగ నుండును. ఈ లవణమును సేవించుటవలన కురుపులు మొదలగునవి పక్వమగును. శరీరమందుండు, అనవసర మగు సజీవపదార్థమును, దీసివేయును. ఇది శరీరమందు తఱుగుటవలననే వ్రణములు, రాచపుండ్లు మొదలగునవి పుట్టుచున్నవి. మెదడునకు వెనుక భాగమం దీ లవణము లోపించిన యెడల, ఆలోచనశక్తి హ్రస్వమగును. వాపు రోగములకు, ఫెరంఫాస్‌ను కాలీమూరుసీయవలయును. వానివలన నయము గానియెడల నీ చూర్ణమును వాడవలయును.

మస్తకము:—చిత్త మస్థిరముగ నుండును. సామాన్యవిషయముల నతిశయముగ భావించు చుందురు. తల తిరుగుడు, పోటు బుట్టును. అవి యతి సామాన్య పరిశ్రమవలనను, చదువుటవల నను వృద్ధిపొందును.

కండ్లు:—కన్నుల వెంట నీరు గారును. కన్నులలో పూలువేయును. చదువునప్పు డక్షరములు సరిగ గనబడవు. చెవులలో నుండి పచ్చనిచీము గారును. చెముడు వచ్చును. చెవుయందు గింగిరుమనుచుండును.

జీర్ణయంత్రము:—పిల్ల లన్నమును దినినంతనే కక్కుకొనుచుందురు. మిక్కిలి యాకలి యుండును. కాని భోజనపదార్థములు నోటికి హితవుగ నుండవు. జీర్ణకోశము దుర్బలత నొందును. గుండెలయందు మంట యుండును. ఋతుకాలమునకు బూర్వమందునను, పిమ్మటను మలబద్ధక మేర్పడును. మూలశంక గలుగును.

చెమట దుర్గంధయుతమై యుండును. నులిపురుగుల సంబంధ మగు శూలనెప్పియుండును.

విశ్వాస ప్రశ్వాసము :—బలహీను లగు బాలకులకు దగ్గుబుట్టును. రాత్రులు చెమట బోయుచుండును. స్వరభంగము గలుగును. దగ్గుతోడ శ్లేష్మపుకళ్లె బడుచుండును. ఆ కళ్లె చెడువాసనతోడ గూడుకొనియుండును. రొమ్ములయందు మంటయుండును.

నడుము, కాళ్లు, చేతులు:—దుర్వాసనతో గూడిన చెమటవచ్చును. కాళ్ళు చేతులు కృశించి పోవుచుండును. ఏదయిన పుండు పడిన యెడల నది సహజముగ నయముగాదు. ఎప్పుడును పడుకొని యుండవలయునను కోరికయుండును. మూర్ఛరోగము కలుగును. శరీరమందు కురుపులు, వ్రణములు, గండమాలలు, కొరుకు రోగముల కీ మందు నీయవలయును. సకల విధములగు

చర్మవ్యాధులకును పుండ్లకును నీ చూర్ణమును వాడవలయును.

మోతాదు:— పురాతన జాడ్యములకు మాత్రము 60 మ. చూర్ణమును వాడవలయును. కురుపులు మొదలగు వానికి 6 మ. వాడుచుండ వచ్చును.

---

# తృతీయ ప్రకరణము



## చికిత్సాతత్త్వము

## (౧) అజీర్ణము

(డిస్ పెప్సియా; ఇండైజేషన్)

జీర్ణశక్తి లోపించుటవలన గాని, భోజన పదార్థములయందుండుదోషమువలనగాని, భుజించిన పదార్థములు జీర్ణముగాక, ఆమ్లోద్గారము-ఆమ్లస్వాదము - వక్షస్థ్సలమందు మంట - వమనము - తేనుపులు - కడుపునందు నులినొప్పి - మలబద్ధకము - తలతిరుగుడు - మానసిక శారీరిక దుర్బలత్వము - మొదలగు దుర్గుణములు గలుగును. అజీర్ణవ్యాధివలన జీర్ణకోశము - కార్జముల క్రియలు చెడిపోవును. నాలుకమీాదను, నోటియందునను, చిన్నచిన్న తెల్లని పొక్కులు

లేచును. నోటినుండి యామ్లగంధయుత మగు దుర్వాసన వచ్చుచుండును.

ఇది మిక్కిలి కఠినవ్యాధి. అయినను సరిగ మందు బుచ్చుకొనుచు, అజీర్ణమునకు దోడ్పడని పదార్థములను భుజించినయెడల నీ వ్యాధి నయమగును.

తైల పక్వ పదార్థములను దినుట వలనను, భోజనపదార్థములను మిక్కుటముగ భుజించుట వలనను, గలుగు అజీర్ణమును తాత్కాలిక మందురు.

జీర్ణయంత్రము :—కార్యముయొక్క క్రియలు మందగించుటవలన గలుగు అజీర్ణము స్థాయీ రూపమును బొందును.

చికిత్స:—ఆమ్లము-గుండెల యందు మంట-ఆమ్లగంధయుక్త వమన మగుచుండిన యెడల నెట్రంఫాస్ 3 మ. చూర్ణమును రెండుగంటల కొకమారు రీయవలయును. దీనితోడ అజీర్ణభుక్త

ద్రవ్యములను గ్రక్కుకొను చుండిన యెడల నెట్రంఫాస్‌ను ఫెరంఫాస్ ౬ వ. చూర్ణము తోడ గలిపి యీయవలయును. వెంటనే గుణము గనుపడును.

అజీర్ణముచేయు పదార్థములను దినుట వలన నీవ్యాధి గలిగినచో క్యాలికేరియాఫాస్ 3 వ. చూర్ణమును రెండుగంటల కొకమారు బుచ్చుకొన వలయును. ఆమ్లవమన మగు చుండిన యెడల నెట్రంఫాస్‌ను గలిపి యీయవలయును.

కడుపునందు నొప్పిగాని, శూలగాని యుండిన యెడల నెట్రంఫాస్, క్యాలికేరియా ఫాస్‌లను చూర్ణముల నీయవలయును. కాని వానివలన దగ్గని యెడల, మ్యాగ్నెసియా ఫాస్ ౬ వ. లేక 3 వ. చూర్ణములను గోరువెచ్చని నీటి యందు గలిపి గంట కొకమా రీయవలయును. తైలపదార్థములను, దినుటవలన గలుగు, అజీర్ణ

మునకు నెట్రంఫాస్ ప్రధానౌషధము. కాని, అట్టి యజీర్ణము శరీరమందు జీర్ణించిన యెడల, భోజనాత్పూర్వ మొకగంట ముందుగా, నెట్రంఫాస్ ౧౨ మ. చూర్ణమును, ఫెరంఫాస్ ౧౨ మ. చూర్ణమును గలిపి యిచ్చుచుండ వలయును.

కార్జములు చెఋటవలన గలిగినయెడల నెట్రంఫాస్ ఉదయమును సాయంత్రమును వాడవలయును.

నాలుక తెలుపుగను విరేచన బద్ధకముగను నుండిన యెడల కాలీమూరు నీయవలయును. కొంతమందికి నెట్రంసల్ఫును కాలీమూరును గూడ వాడవలయును.

ఈ వ్యాధి సంబంధమగు లక్షణములు సాయంత్రపువేళ వృద్ధి యగుచుండినయెడల కాలీసల్ఫ ౬ మ. చూర్ణమును నీయవలయును.

ఈ వ్యాధి ఒంట జితించినయెడల నెట్రం మ్యూరు కాలీమూరు నెట్రంసల్ఫు సాయిలీసియా మొదలగువానిని బుచ్చుకొనవలయును.

ఈ వ్యాధికి బుచ్చుకొను లవణము లన్నిటిని గోరువెచ్చని నీటియందు గలిపి యిచ్చుచుండవలయును.

ఈ జాడ్యము గలవార లుదయముననే యొక పంచపాత్రెడు గోరువెచ్చని నీరు ద్రావుచుండుట మంచిది. అందువలన మిక్కిలి గుణము గనుపడును. అనాయాసముగ జీర్ణించు పదార్థములను మాత్రమే భుజింప వలయును. దుంపలు, మాంసము, పిండివంటలు మొదలగు వానిని దినరాదు. కుండలయందు సన్నని సెగ మీాద నుడికిన పదార్థములను, చల్లారినతర్వాత భుజింప వలయును. శీతలజలమునందు స్నానము చేయుచుండ వలయును. ఉదయము సాయంత్రము మంచిగాలియందు దిఱుగవలయును.

## (౨) అనిద్ర

శరీరారోగ్యము గలవారలు బాగుగ నిద్దుర బోవుచుందురు. ఎప్పుడును పరిశ్రమజనక మగు కార్యములు చేయుచుండువారికి, నిద్దురరా దను మాటయుండదు. మంచి నిద్దురవలన శరీర మారోగ్యముగ నుండును. మానసిక పరిశ్రమ వలనను, ఉత్కంఠత, భయము, దుఃఖము, శోకము, మొదలగువానివలనను, నీ వ్యాధి కలుగుచున్నది.

చికిత్స :—మనఃపరిశ్రమ వలనను, ఉత్కంఠత, భయము, దుఃఖము, శోకము మొదలగు వానివలనను,నిద్దురబట్టనియెడల కాలిఫాస్ ౬ మ. చూర్ణమును బుచ్చుకొనవలయును. దీనివలన స్నాయువులకు బలము వృద్ధియగును. పిచ్చివాండ్రకు కాలీఫాస్ ౬ మ. చూర్ణమును నీయవలయును. ఈ లవణమే పిచ్చివారలకు ముఖ్యౌషధము.

తలయందు మిక్కుటముగ రక్తము చేరుట వలన నిద్ర రానియెడల ఫెరంఫాస్ ౧౨ మ. చూర్ణమును సేవించిన నీ వ్యాధి నయమగును. కొందఱకు, ఫెరంఫాస్‌తోడ కాలీఫాస్‌ను గలిపి గాని, పర్యాయక్రమముగా గాని వాడవలసి యుండును.

ఆమ్లాజీర్ణమువలన నిద్దుర పట్టనియెడల నెట్రంఫాస్ నీయవలయును. తలను చలినీళ్ల తోడను, కాళ్లు చేతులను, వేడినీళ్లతోడను, గడుగుకొనుచుండవలయును. చెఱువునందుగాని, నదియందుగాని, కాలువయందు గాని, స్నానము జేయుచుండవలయును. అజీర్ణకర ద్రవ్యములం దినరాదు. ముఖ్యముగ సాయంత్రపువేళ కాఫీ, టీ, సారాయి మొదలగు పానీయములను త్రాగ గూడదు. ఆనందమును గలిగించు కార్యములను మాత్రమే చేయుచుండవలయును. పలు విధము లగు సుగంధద్రవ్యములను వాడుచుం

డుట మంచిది. నువ్వుల నూనెనుగాని, బాదము నూనెనుగాని తలకు రాచుకొనవచ్చును. దేనిని గూర్చి మిక్కిలి యోచించుటగాని, తొందర పడుటగాని, భయపడుటగాని కూడదు. విశుద్ధ మగు వాయువునందు దిరుగుచుండవలయును.

## (3) అతిమూత్రవ్యాధి

ఈవ్యాధి రెండువిధములు :—(౧) మూత్ర పరిమాణ మెక్కుడుగ నుండును. కాని దాని యందు పంచదారమాత్ర ముండదు. (౨) మూత్రపరిమాణ మెక్కుడుగ నుండుటయేగాక దానియందు పంచదార యుండును. రెండువిధ ములనుండు నతిమూత్ర వ్యాధులకును, అతిదా హము, దుర్బలత్వ మధికముగ నుండును. ఇందు, పంచదారగలవ్యాధి కఠినవ్యాధి.

చికిత్స:—మూత్రమందు పంచదారయున్న ను లేకున్నను, నెల్లంసల్ఫేటు, చూర్ణమును

దినమునకు, నాలుగుమారులు పుచ్చుకొనవల యును. ఇందువలన మూత్ర పరిమాణము హ్రస్వమగును.

దుర్బలత్వమునకు కాలీఫాస్ ౩ మ. చూర్ణ మును రోజునకు రెండు మూడుమారులు పుచ్చు కొనవలయును.

మూత్రమందు, పంచదార యుండినయెడల కాలీమూరు ౩ మ. చూర్ణమును దినమునకు రెండు మూడుమారులు తినవలయును.

అతి దాహామునకు నెట్రంమ్యూరు ౩ మ. చూర్ణమును సేవించవలయును.

పంచదార లేని యతిమూత్రవ్యాధికి, నెట్రం మ్యూరు ప్రధానౌషధము.

ఈవ్యాధిగ్రస్తులకు బలమువచ్చుటకు గాను, క్యాలికేరియాఫాస్‌ను రోజునకు రెండుమూడు మారు లిచ్చుచుండవలయును.

పథ్యము:—రొట్టెను, మాంసమును, శాకములను దినవచ్చును. విశుద్ధమగు గాలియందు దిఱుగుచుండ వలయును. శరీర బలమును బట్టి వ్యాయామ మొనర్చుచుండవలయును. శీతల జలస్నానము మంచిది. ఎప్పుడును వస్త్రమును గప్పుకొని యుండవలయును. వరియన్నము, దుంపపదార్థములను దినవలదు. పంచదార బెల్లమును ముట్టరాదు.

## (౮) ఆకలి (బడబానలము)

శరీర మెప్పుడును క్షయమొందు చుండును. క్షయ నివృత్తికి క్షుధ బుట్టుచుండును. ఆకలికి తగిన ఆహారము లేనియెడల శరీరము దుర్బలమై క్షయ మొందును. కొన్ని కారణముల వలన కొందఱకు మిక్కుటమగు నాకలి యుండును. భుజించిన మరుక్షణముననే మిక్కిలి యాకలి గలుగును. అతిమూత్ర వ్యాధిగల వారలకు

మిక్కుటముగ నాకలి యుండును. అప్పుడు దానికి మందు నీయవలయును. పలుకారణముల వలనను, అనేక రోగముల తోడను, ఆఁకలి కొందఱకు మందగించు చుండును. కొందఱకు హెచ్చు చుండును. అప్పుడు మందు దినవల యును.

చికిత్స:—మిక్కిలి యాకలియు, దానికిఁదగిన యాహారమును దినినను శరీరమునకు బలము గలుగ కుండిన యెడల, కాలిఫాస్ ౬ మ. చూర్ణమును దినమునకు మూఁడు నాలుగు మా రులు పుచ్చుకొన వలయును. అతిమూత్ర, వ్యాధిగల వారలకిట్టి యాకలి యుండును.

కడుపునందు పురుగులుండుట వలన నాకలి వృద్ధియగు చుండును. అందువలననే పిల్లలు పలుమా అన్నము దినుచుందురు. కావున వారికి నెట్రంఫాస్ ౬ మ. చూర్ణమును దినము నకు రెండుమూఁడు మారు లీయవలయును.

కార్శ్యము వృద్ధియగుటవలన నాకలి మంద గించిన యెడల, నాలుక తెలుపగును. మలినా వృతముగ నుండిన యెడల కాలిమూరు ౬ వ. చూర్ణమును దినమునకు మూడు నాలుగుమారు లీయవలయును.

కాలి కేరియా ఫాస్, నెట్రంఫాస్, ౬ వ. చూర్ణములను గలిపి గాని, యందొక్క దానిని గాని రోజునకు నాలుగుమారు లిచ్చిన యెడల, ఆకలి వృద్ధి యగును. జీర్ణశక్తి చక్కబడును. ఆకలి మందగించిన నతిసులభముగ జీర్ణమగు వానిని దినవలయును. ఆకలి హెచ్చుగ నుండిన బలమగు నాహారము పెట్టవలయును. శీతల జలస్నానము చేసి మంచిగాలియందు దిరుగు చుండవలయును:—

(౫) ఆటలమ్మ

ఇది స్ఫోటకపు జాతిలో జేరినది. కాని, అతి శీఘ్రముగ నయమగును. శరీరమం దంతటను

పొక్కులు లేచును. వానియందు, చీముండదు. జలమువంటి పదార్థము మాత్రముండును. ఆనీ రినికి పొక్కులు మానిపోవును. అస్వస్థతగనున్న ౨౪ గంట లయినపిమ్మట, శరీరమందు, చిన్న చిన్న పొక్కులు గనుపడును. తర్వాత దానియందు నీరు కూడుకొనును. నాలుగు దినము లయిన పిమ్మట, ఆపొక్కు లెండిపోవును. ఈజాడ్యమునకు సాధారణముగ జ్వరముండదు.

చికిత్స:—జ్వరముండిన యెడల ఫెరంఫాస్ ౬మ చూర్ణమును, నెట్రంమ్యూరు ౬మ. చూర్ణమును, పర్యాయ క్రమముగ రెండు గంటల కొకమోతాదు నీయవలయును.

జ్వరము లేకుండినయెడల నెట్రంమ్యూరును కాలిమూరును, పర్యాయ క్రమముగ రెండు గంటల కొకమా రీయవలయును.

కాలీసల్ఫు ౬ మ. చూర్ణమును దినమునకు రెండుమారు లిచ్చిన యెడల, పొక్కులమీది

చర్మ మూడి మచ్చలు మాసిపోవును. చర్మము మృదువగును.

ఈ వ్యాధి నయమైన పిమ్మట దినమునకు రెండుమారులు క్యాలికేరియాఫాస్ ౬ ఎమ. చూర్ణమును సేవించవలయును. ఇందువలన నాకలి బుట్టును, శరీరమునకు బలము వచ్చును.

బాగుగ నయము గానంతవఱకు స్నానము చేయించ గూడదు. శరీరమున కెప్పుడును బట్ట కప్పియుంచవలయును. చలిగాలి తగులగూడదు. మత్స్య మాంసములు బెట్టరాదు. అన్నముదిన వచ్చును. పాలుద్రావవచ్చును.

## (౬) ఇస్టీరియా

సాధారణముగ యౌవనస్త్రీల కీవ్యాధి గలుగును. బాలికలకుఁగూడ సకృత్తుగా వచ్చును. నరముల దౌర్బల్యమె యీవ్యాధికి ప్రధానకార

ణము. సోమరిపోతుగ నుండుటవలన గూడ నిది సంభవించును.

చికిత్స:—ఇది యాక్రమించునప్పుడు, కాలీఫాస్, ౬ మ. చూర్ణమును, గంటకొకమారీయవలయును. తర్వాత రోజునకు మూడునాలుగుమారు లీయవలయును.

ఈవ్యాధి వచ్చినప్పుడు కాళ్లు చేతులు లాగుకొని పోవుచుండును. అప్పుడు మ్యాగ్నెసియాఫాస్ ౬ మ. చూర్ణమును వాడవలయును.

కాళ్లు, చేతులు లాగుకొని పోవునప్పుడు, వానిని లాగిపట్టి యుంచవలయును. మోము మీద తడిగుడ్డను వేయవలయును.

వరుసగ కాలీఫాస్‌ను కొన్నిదినములు దినవలయును. బాగుగ శరీరవ్యాయామ మొనర్చుచుండవలయును. సోమరిపోతుతనము గూడదు.

స్త్రీలకు ఋతుస్రావము గాకుండుట వలన నీవ్యాధిగలిగినయెడల, నెట్రంమ్యూర ౧౨ మ.

చూర్ణమును, దినమునకు రెండుమూడుమారులు
బుచ్చుకొనవలయును.

## (౭) ఉబ్బసపు దగ్గు

ఇది మిక్కిలి కఠినవ్యాధి. కొందఱకు రెండు మూడు దినములు మాత్రముండి నయమగును. కాని వెంటనే తిఱిగి యుబ్బసపు దగ్గు వచ్చును. చలిగాలి తగులుట వలన గూడ నీదగ్గు వచ్చును. కాని జలుబు తగ్గినంతనే దగ్గుతగ్గును.

చికిత్స:—ఫెరంఫాస్ ౬ మ. చూర్ణమును, మ్యాగ్నెసియాఫాస్ ౬మ. చూర్ణమును రెండు గంటల కొకమారు పర్యాయ క్రమముగఁ బుచ్చుకొనవలయును. ఇందువలన శ్వాసకష్టము నివారణ మగును.

కాలీఫాన్‌ను బుచ్చుకొనుట వలన గొంద ఱకు నయమగును.

ఉదయముననే దగ్గు ప్రారంభ మైనను, అధికముగ శ్లేష్మము పడుచుండినను, నెట్రంసల్ఫు ౧౨ మ. చూర్ణమును దినవలయును.

ఒకవారము నెట్రంసల్ఫు ౧౨ మ. చూర్ణమును, రెండవ వారము క్యాలికేరియా ఫాస్ 3 మ. చూర్ణమును, మూడు నాలుగు వారములు, దినమునకు రెండు మోతాదులు పర్యాయ క్రమముగ బుచ్చుకొనిన యెడల దగ్గు పూర్తిగ నయమగునని కొందఱు తమ యనుభవమును జెప్పుచున్నారు.

సాయిలీసియాను, క్యాలికేరియా ఫాస్ను బుచ్చుకొనుటవలన కొందఱకు నయమగును.

అతి సులభముగ జీర్ణించు పదార్థములను మాత్రమే కొద్దిగ రోజునకు మూడు నాలుగు మారులు భుజించవలయును. శీతల జలస్నాన ముత్తమము. దగ్గు వచ్చినప్పుడు మాత్రము

గాలి తగులని గదియందు వేడినీటి స్నానమును చేయవచ్చును.

### (౮) ఋతుస్రావము

సాధారణముగ మనదేశమందు ౧౨-౧౩ వత్సరములు వచ్చునప్పటికి, స్త్రీలకు ఋతువు ప్రారంభమగును. కొందఱావయసునకు బూర్వమునను, బరమందునను గూడ రజస్వల యగుచుందురు. కొంతమందికి రజస్వలయైన యాఱుమాసములు, వత్సరముదనుక తిఱిగి ఋతుస్రావము గలుగదు. విశుద్ధమగు ఋతుస్రావము నలుపుగను, పలుచగను, నొకవిధమగు గంధయుక్తముగ నుండును. ఇట్లు ఋతువు ముప్పదిదినముల కొకమారు ౪౫ వత్సరముల వయసువఱకు వచ్చుచుండును. గర్భిణీస్త్రీలకు ఋతుస్రావము గాదు. కఠినరోగములచే నాక్రమింపబడుటవలన, రక్తము లోపించి కొన్ని నెలలవఱకును ఋతుస్రావముగాదు.

సరిగ నెలనెలకుఋతుస్రావము గాకుండుటను రోగమందురు. కొంతమంది స్త్రీలకు ౧౦-౧౫-౨౦ దినములకే ఋతుస్రావము వచ్చుచుండును. మఱికొందఱకు, కొన్ని నెలలవఱకును ఋతుస్రావము గాదు. స్రావమగునప్పుడు మిక్కిలి బాధయుండును. కొందఱకు రక్త మధిక పరిమాణము స్రవించును.

(౧) స్వల్పరజస్సు :—ఋతుస్రావము కొద్దిగా గాని, చాలదినములవరకు గాని, కాకుండిన యెడల దానిని స్వల్పరజస్సని చెప్పుదురు.

(౨) కష్టరజస్సు :—ఋతు కాలము నందు నొప్పి, పోట్లు, ఉండినయెడల దానిని కష్టరజమని చెప్పుదురు.

(3) రక్తప్రదరము :—పరిమాణమును మించి ఋతుస్రావమయినయెడల దానిని రక్తప్రదర మని చెప్పుదురు.

ఈ మూడు విధములగు జాడ్యములకు వేఱు గా చికిత్స చేయవలయును.

యౌవనకాలమందు స్త్రీలకు ఋతువు సకాలమునకు రానియెడల చికిత్స చేయవలయును. కారణము గనుగొని మందునిచ్చుటవలన సకాలమునకు ఋతువు వచ్చును.

శరీరమందు రక్తము దఱుగుటవలన సకాలమునకు, ఋతువురానిచో, క్యాలి కేరియాఫాస్ 3 మ. చూర్ణమును, రోజున కయిదాఱుమారులు బుచ్చుకొన వలయును.

మలేరియా జ్వరము వచ్చుట వలన రక్తము క్షీణించిన యెడల నెట్రంసల్ఫు 3 మ. చూర్ణమును గాని ౬ మ. చూర్ణమును గాని సేవించ వలయును.

అజీర్ణము, ఆమ్లము, మొదలగు వ్యాధుల వలన రక్తము తఱిగిన యెడల నెట్రంఫాస్‌ను

గాని, క్యాలికేరియాఫాస్‌ను గాని పుచ్చుకొన వలయును.

ఈ వ్యాధి గలవారలు పరిశ్రమ జనకమగు కార్యములను జేయుచుండ వలయును. శీతల జలస్నాన ముత్తమము. బలము నిచ్చునట్టియు, బాగుగ జీర్ణమగు పదార్థములను మాత్రమే భుజింపవలయును. రాత్రులు మేలుకొనగూడదు. మానసిక పరిశ్రమ నిషిద్ధము.

(౧) స్వల్పరజము:—సకాలమునకు ఋతుస్రావము గాకుండుటయు, అయినను బహుస్వల్పముగ స్రావమగుచుండుటయు, మూడు నాలుగు మాసములకు గాని ఋతువు గాకుండుటయు స్వల్పరజ మని చెప్పుదురు.

చికిత్స:—రక్తము క్షీణించుటవలన నీవ్యాధి గలిగినయెడల క్యాలికేరియాఫాస్ ౬ వ. చూర్ణమును రోజునకు రెండు మూడు మారులు దిన వలయును. అందువలన రోగికి బలము వచ్చును.

రక్తము వృద్ధి యగును. ఋతువు సకాలమున కగును. యౌవనస్త్రీలకు సకాలమునకు ఋతువు గాకున్నను ఋతుస్రావ మత్యల్పముగ నగుచున్నను, స్రావము నీటివలె నుండినను, మోము పాలిపోయినను, విరేచనబద్ధక ముండినను నెట్రం మ్యూ్యారును సేవించవలయును.

మిక్కిలి దుర్బలత్వమును, మూర్ఛ, భ్రమ, దడ, మొదలగు వ్యాధులు గల స్త్రీలకు కాలిఫాస్ ౬ మ. చూర్ణమును రోజునకు రెండు మూడు మారు లిచ్చు చుండ వలయును. సాధారణముగ స్థూలకాయము గల స్త్రీల కీ జాడ్యము కనుపడుచుండును. అట్టివారు బాగుగ పరిశ్రమ చేసినయెడల శరీరము సన్నగిలి సకాలమునకు ఋతువు వచ్చును. వీరికి కాలిసల్ఫు ౬ మ. చూర్ణమును వాడవలయును.

(౨) అష్టరజము:—(ఋతువేదన)ఋతుస్రావ కాలమందు పొత్తికడుపు, జననేంద్రియకోశము

నొప్పిగ నుండినయెడల దానిని కష్టరజమని చెప్పు దురు. కొందఱు ఋతుస్రావ కాలమందు మిక్కిలి బాధ పడుదురు. కొందఱకు బాధ ఋతుకాల మునకు మూడు నాలుగు దినములు పూర్వమే ప్రారంభమగును. ఆ బాధ, స్రావము వెలువడి నంత నెయాగిపోవును. కొందఱకు ద్రవకాలమందు మాత్రమే వేదన యుండును.

చికిత్స :—ఋతువునకు బూర్వమే కడుపు నొప్పి ప్రారంభమై స్రావమగుటతోడ నది తగ్గు చుండినయెడల ఫెరంఫాస్ ౬ మ. చూర్ణమును దినమునకు రెండు మూడు మారులు పుచ్చు కొనవలయును.

ఋతుస్రావ మగునప్పుడు మాత్రమే వేదన యుండినయెడల మ్యాగ్నెసియాఫాస్ 3 మ. చూర్ణమును గాని, ౬ మ. చూర్ణమును గాని, వేడి నీటితోడ రెండుగంటల కొకమారు పుచ్చు కొనవలయును. అందువలన బాధ తొలగును.

తిఱిగి ఋతువు వచ్చువఱకును ఫెరంఫాస్ ౬ మ. చూర్ణమును దినమునకు ముమ్మారు పుచ్చుకొన వలయును.

రక్తము తఱుగుటవలన నీవ్యాధి గలిగిన యెడల, క్యాలికేరియాఫాస్ ౬ మ. చూర్ణమును పర్యాయక్రమముగ దినమునకు నాలుగు మారులు పుచ్చుకొనవలయును.

ఋతుస్రావ మతి పలుచగను, ముద్దలు ముద్దలుగ, నగుచుండినయెడల కాలిమూరు ౬ మ. చూర్ణమును రోజునకు 3-4, మారులు పుచ్చుకొనవలయును.

పై విధమున మందులు వాడినయెడల రోగము సమూలముగ నశించును. సకాలమునకు ఋతువగును. ఝూడించి విరేచనమగునటులు ప్రయత్నింపవలయును. ఈరోగి సోమరిపోతుగా నుండక, బాగుగ నడుమువంచి గృహకృత్య

ముల నెలవేర్చుచుండవలయును. ఋతుకాల మందు చలిగాలి తగులగూడదు.

(3) రక్తప్రదరము:—ఋతువు సకాలము నకు రాకుండుటయు, మిక్కిలి స్రావమగుచుండుటయు, లేక ౧౫-౧౬ దినములకే ఋతుస్రావమగుచుండుటయు సంభవించిన యెడల దానిని రక్తప్రదరమని చెప్పుచుందురు.

చికిత్స :—ఈ వ్యాధికి ఫెరంఫాస్. ౬ మ. చూర్ణమును గంట కొకమారు పుచ్చుకొనవలయును.

గర్భకోశము దిగజారి బైటకు పోడుచుకొని వచ్చుటవలన నీవ్యాధి గలిగినయెడల క్యాలికేరియా ఫ్లవరు ౬ మ. చూర్ణమును రెండుగంటల కొకమారు ఫెరంఫాస్తోడ పర్యాయ క్రమముగ నీయవలయును.

రక్తము నలుపుగను, పలుచగను, దానియందు, ఉండలవలె రక్తపు గడ్డలు పడుచుం

డిన యెడల, కాలిఫూరు ౬ మ. చూర్ణమును
రెండుగంటల కొకమారు పుచ్చుకొనవలయును.

రక్తమునలుపుగను, పలుచగనుమాత్ర మగు
చుండిన యెడల, కాలిఫాస్ ౬ మ. చూర్ణమును
రెండుగంటల కొకమారు పుచ్చుకొనవలయును.

స్రావము నీటివలె నగుచుండినను జాల దిన
ములవఱకగుచుండినను, నెట్రింమ్యూర్యారు ౧౨
మ. చూర్ణమును రెండు గంటల కొకమారు
సేవించవలయును.

రక్తవిహీనమువలన నీ జాడ్యము కలిగిన
యెడల క్యాలికేరియాఫాస్ దినమునకు 3-౪
మారులు పుచ్చుకొనవలయును.

తఱచుగ ఋతుస్రావసంబంధ మగు జబ్బు
గలుగుచుండినయెడల దానికి గారణ మారసి
యారోగమున కీయవలసిన మందును ఋతుకాల
మధ్య దినములలో రెండు మూడు మారులు
సేవించవలయును.

ఈరోగులు, మిక్కిలి వేడిని గలిగించు వస్త్రములను గాని, యుద్రేకమును కలిగించు నాహార పానీయములనుగాని పుచ్చుకొన గూడదు. శీతల జల స్నానమును జేయుచుండవలయును. విశుద్ధ వాయువును సేవించుచుండవలయును. బాగుగ నడుము వంచి పని చేయవలయును. తేలికమై త్వరగా జీర్ణించు వస్తువులను మాత్రమే తినవలయును.

## (౯) ఎక్కిళ్లు

ఆమ్లమువలనను, కడుపునందు పురుగులు చేరుటవలనను పాకస్థలియందలినరముల యుత్తేజనమువలనను ఎక్కిళ్ళు పుట్టుచుండును.

చికిత్స:—మ్యాగ్నేసియాఫాస్ దీనికి ప్రధానౌషధము. కావున, ౬ వ. చూర్ణమును అరగంట కొకమారు పుచ్చుకొనవలయును.

ఆమ్లము లేక క్రిమివలన నీవ్యాధి గలిగిన యెడల మ్యాగ్నెసియాఫాస్ తోడ నెట్రంఫాస్

3 వ. చూర్ణమును గలిపికాని పర్యాయక్రమ
ముగ గాని తినవలయును.

అధికముగ శీతలజలమును గాని, వేడినీటిని గాని త్రావినయెడల నిది తగ్గి పోవును. శిశువులకు స్తన్యమిచ్చిన తఱుగును. ఆమ్లమువలన నైన యెడల నెట్రంఫాస్ 3 వ. చూర్ణము నీయవలయును.

## (౧౦) కలరా

నీళ్లవిరేచనములు, వాంతు లగుచుండును. కొందఱకు మూత్రము గూడ బంధించును. చేతులుకాళ్లు కొంకరలు పోవును. అతిదాహ ముండును. రోగియు దుర్బలుడగును. ఇది మిక్కిలి కఠినజాడ్యము. కావున ఈ వ్యాధి వచ్చిన వారలు చాలమంది చనిపోవుచుందురు. కావున, ప్రారంభదశయందే మిక్కిలి జాగ్రత్తగ చికిత్స చేయవలయును.

చికిత్స :—మొదటి నుండియు నెట్రంసల్ఫ 3 వ. చూర్ణమును. గంటకు రెండు మూడు మారులు వాడవలయును. విరేచనము బియ్యపు కడుగువలె నగుచుండినయెడల ఫెరంఫాస్ ౬ వ. చూర్ణమును కాలీఫాస్ ౬ వ. చూర్ణమును గలిపి గంట కొకటి రెండుమార్లీయ వలయును. కాళ్లు చేతులు కొంగరులు పోవు చున్నయెడల మ్యాగ్నేసియాఫాస్ ౬ వ. చూర్ణమును వేడినీళ్లయందు గలిపి గంటకు మూడు నాలుగుమార్లీయవలయును.

అతిదాహ ముండిన యెడల నెట్రంమ్యూరును వేడినీళ్లయందు గలిపి, యానీటిని ద్రాగుట కిచ్చుచుండవలయును.

ప్రథమావస్థ యందు ఫెరంఫాస్ ౬ వ. చూర్ణమును, కాలీసల్ఫ ౬ వ. చూర్ణమును పర్యాయక్రమముగవాడినయెడల నయమగును.

మూత్రము బంధించిన యెడల నెట్రంఫాస్ ౬ మ. చూర్ణమును ౧౫ నిముసముల కొకమారీయ వలయును.

మూత్రము బంధించి తలయం దెక్కుడుగ రక్తము చేరినయెడల ఫెరంఫాస్ ౬ మ. చూర్ణమును, నెట్రంఫాస్ ౬ మ. చూర్ణమును పర్యాయక్రమముగ వాడవలయును.

విరేచనములయందు పురుగులు గాని, ఆమ్లగంధము గాని యుండినయెడల నెట్రంఫాస్ 3 మ. చూర్ణము నీయవలయును.

వేడినీళ్లతో నింపిన సీసాలను, అరిచేతులు, అరికాళ్లకు ఆనించి యుంచవలయును.

ఈ వ్యాధి కుదిరిన పిమ్మట శరీరబలమునకు, క్యాలికేరియా ఫాస్ 3 మ. చూర్ణమును గాని, ౬ మ. చూర్ణమును గాని రోజుకు రెండు మూడు మారులు పుచ్చుకొనవలయును.

విరేచనములు వాంతులు కట్టుకొనునంతవర కేవిధమగు ఆహారము నీయ గూడదు. త్రాగు నన్ను వేడినీళ్లను మాత్ర మీయవచ్చును.

విరేచనము లాగిన పిమ్మట తేలికగ నరుగు నట్టి పదార్థములను మాత్రమే పెట్టవలయును.

## (౧౧) కండ్లకలక

కండ్లయం దిసుకపోసి నటు లుండును. కను రెప్ప లెర్రగా నుండును. పోట్లుండును. నీరు గారుచుండును. పుసిగట్టు చుండును.

**చికిత్స:—** ప్రథమమున ఫెరంఫాస్ ౬ మ. చూర్ణమును రెండుగంటల కొకమారు పుచ్చు కొనవలయును. ఫెరంఫాస్ ౧౨ మ. చూర్ణ మును మూడునాలుగు మారులు కనురెప్పల లోపలి భాగమందు వ్రాయవలయును. ఇందు వలన మంటలు పోట్లు మొదలగున వన్నియు నయమగును.

పుసి గట్టుచుండిన యెడల కాలీమూరు ౬ మ. చూర్ణమును రెండుగంటల కొకమా రీయవలయును. కాలీమూరు ౧౨ మ. చూర్ణ మును మూడునాలుగు మారులు కంటియందు వేయవలయును.

ఎండయందు దిరుగరాదు. కన్నులకు శీతము తగులగూడదు. పచ్చని గుడ్డను కండ్లకు గట్టు కొనవలయును.

## (౧౨) కాలుట

చికిత్స:—శరీరమం దేభాగమైనను గాలిన యెడల ఫెరంఫాస్ ౬ మ. చూర్ణమును రెండు గంటల కొకమారు పుచ్చుకొననలయును. ఫెరం ఫాస్ 3 మ. చూర్ణమును నీటియందు గలిపి కాలినచోట దట్టముగ పట్టించవలయును.

బొబ్బలు పొక్కినయెడల కాలిమూరు ౬ మ. చూర్ణమును రెండు గంటల కొకమారు పుచ్చు

కొనవలయును. కాలిమ్యూరు 3 వ. చూర్ణము ను నీటియందు గలిపి ఆ బొబ్బలకు దట్టముగ పట్టించవలయును. ఇందువల్ల బాధ తగ్గును. బొబ్బ లణగిపోవును.

పుండు పడిన యెడల క్యాలికేరియా సల్ఫ ౬ వ. చూర్ణమును, రోజుకు నాలుగైదు మారులు పుచ్చుకొనవలయును. క్యాలికేరియా సల్ఫ 3-వ. చూర్ణమును మలామువేసి పుండు మీద పూయవలయును. జ్వర ముండినయెడల ఫెరంఫాస్‌ను గూడ పర్యాయక్రమముగ నీయవలయును.

పుండు పడి చీముపట్టినయెడల కాలిఫాస్, నెట్రంఫాస్, సాయిలీసియాను పుచ్చుకొనవలయును. ఆస్థితియందు డాక్టరుల సహాయమును నొందుట యుత్తమము.

శరీరము కాలినప్పుడు దగ్గర మందు లేని యెడల వెంటనే కాలినచోట దూదిని వేసి కట్ట

వలయును. దానికి గాలిని తగుల నియ్య గూడదు.

చిన్న బొబ్బ లయినయెడల, అందు గూడు కొనియుండు జలము వెలుపలికి రాకుండినను భయములేదు. బొబ్బలు పెద్దవి యయినయెడల బొబ్బల క్రిందిభాగమునందు సూదితోడ గ్రుచ్చిన యెడల నందలి నీరంతయు గాఱిపోవును. కాని, గాలిని మాత్రము తగులనీయ గూడదు. దాని మీద పైనవివరించినమందులను వేయవలయును.

మిక్కిలి కాలినయెడల పథ్యమువిషయము జాగ్రత్తగ నుండవలయును.

## (౧౩) కార్జము చెడుట (లివరు)

కుడిడొక్కయం దుండు కార్జ మను యంత్ర ముబ్బును. ఉష్ణప్రధానదేశమం దీ వ్యాధి సాధారణముగ పుట్టుచుండును. ఆమాశయము గలిగిన పిమ్మటను, అత్యధికముగ మద్యపాన

మొనర్చుట వలనను, ఈ వ్యాధి గలుగును. మలేరియా జ్వరముతోడ సాధారణముగ కార్జము తీపుగ నుండును. మిక్కుటముగ క్వాయినాను దినుటవలన గూడ నీవ్యాధి గలుగుచున్నది. కార్జ ముబ్బినప్పు డచ్చుట పోటు, తీపు, భారముగ నుండును. జ్వర ముండును. నోరు చేదుగను నాలుక శ్వేతవర్ణముగను, మలినావృతముగ నుండును. దీనితోడ విరేచనబద్ధకము గూడ నుండును.

చికిత్స:—ప్రథమావస్థయందు, ఫెరంఫాస్ ౬ మ. చూర్ణమును, నెట్రంమ్యూరు ౬ మ. చూర్ణమును పర్యాయక్రమముగ రెండు గంటల కొకమారు పుచ్చుకొన వలయును. కార్జము మిక్కుటముగ వాచినను, విరేచన బద్ధకముండినను, నాలుక తెలుపుగను మలినావృతమై యుండినను, కాలీమూరు ౬ మ. చూర్ణమును బుచ్చుకొనవలయును.

మిక్కుటముగ క్వాయినాను దినుటవలన నీ వ్యాధి గలిగినచో నెట్రంమ్యూరును బుచ్చుకొనవలయును.

శరీరము లోపల కార్జము దగ్గర పొక్కులు లేచినటు లనుమాన ముండినచో, క్యాలికేరియా సల్ఫు ౧౨ వ. చూర్ణమును, సేవించిన గుణ మిచ్చును. కార్జ ముండు ప్రదేశమున ప్రథమమున ఫెరంఫాస్‌ను, తర్వాత కాలీమూరును, నీళ్లయందు గలిపి పైన పూయవలయును. ఆవిరి పట్టవలయును. రోగి నెప్పుడును పరుండ బెట్టి యుంచవలయును.

బార్లీగంజి, జావ, మొదలగునవి త్రాగవచ్చును. పండ్లరసము మంచిది. పాలు, పెరుగు మొదలగు వానిని ద్రాగగూడదు.

(౧౮) కాళ్లు చేతులు పెదవులు పగులుట

శీతకాలమందు సాధారణముగ నందఱకును

కాళ్ళు చేతులు పెదవులు పగులుచుండును. పిల్లలకు పెదవులు శీతగాలికి మిక్కుటముగ పగులును. చర్మముక్రింద నుండు తైలమువంటి పదార్థము తఱుగుటవలనను, చలిగాలి తగులుట వలనను, మఱికొన్ని కారణములవలనను నిది సంభవింపుచుండును.

చికిత్స :—నూనెను గాని, నేతినిగాని, పగుళ్ళకు బూయుచుండ వలయును. అందువలన పగుళ్ళు నయమగును. నయము కానియెడల, కాలిమూరును గాని, క్యాలికేరియా ఫ్లవరును గాని, నూనెయందు లేక, నేతియందు గలిపి పగుళ్ల మీద బూయవలయును. వెన్నను కొబ్బరి నూనెను, గ్లిసరయినును గూడ వాడవచ్చును. పెదవులు మిక్కుటముగ పగిలినయెడల నెట్రం మ్యూరు ౬ మ. చూర్ణమును దినమునకు రెండు మూడు మారులు పుచ్చుకొనవలయును.

## (౧౫) కామెర్లు

కుడి డొక్కయందుండు, కార్జము చెడుట వలనను, ఉబ్బుటవలనను, పిత్తము వెలుపలకు రాక రక్తమందు గలియుటవలనను, శరీరము, కండ్లు, నాలుక, నోరు, మూత్రము, మొదలగునవి పచ్చబడును. కాని విరేచనము మాత్రము తెల్లగనుండును. పిత్తకోశమందు రాళ్ళు పుట్టి యవి నాళములను బంధించుట వలనను, మిక్కుటముగ క్వయినాను తినుటవలనను, మలేరియా జ్వరమువలనను భోజన పదార్థముల యందలి దోషమువలనను హఠాత్తుగా చలిగాలి తగులుట వలనను శోకము, మనఃకష్టము, మొదలగువాని వలనను కామెర్లరోగము పుట్టుచుండును.

చికిత్స:— ఈ వ్యాధికి ప్రధానౌషధము నెత్రంసల్ఫు. కావున ౬మ. చూర్ణమును సేవించవలయును.

యందును, నొప్పిగలిగిన వానిని వాతనొప్పు లని చెప్పుదురు. తేమనేలలయందు నివసించుటవలనను, జలుబుచేయుట వలనను, ఆహారమందలి దోషమువలనను, నీవ్యాధి గలుగుచుండును. ఇది సంభవించిన స్థానమందు పోటు, తీపు ఉండును. కొందఱకు, జ్వరముగూడ వచ్చును. ఈవ్యాధి పురాతనమైన యెడల జ్వరముగాని పోట్లుగాని యుండవు.

చికిత్స :— ప్రథమమున నీ వ్యాధికి ఫెరం ఫాస్ ౬ మ. చూర్ణమును, నెట్రంఫాస్ ౬ మ. చూర్ణమును, పర్యాయక్రమముగ రోజునకు నాలు గయిదుమాఱు లీయవలయును.

బొట్టనవ్రేళ్లు మొదలగు చిన్న సంధులయం దిది సంభవించినయెడల నెట్రంసల్ఫు ౬ మ. చూర్ణమును, దినమునకు నాలు గయిదుమాఱు లీయవలయును.

కీళ్లయందు వాచినయెడల కాలీమూరు ౬ వ. చూర్ణమును, వాడవలయును.

మరియు, కాలీమూరు 3 వ. చూర్ణము నొక డ్రాము నొకయవున్సు వాసలయినునందు గలిపి, ఆక్రాంతస్థానమున మర్దించవలయును. ఆవిరి బట్టవలయును. కాపు కాయవలయును. దానికి ఫ్లానలుగుడ్డను చుట్టవలయును.

నరముల సంబంధ మగు వాతపునొప్పులకు కాలిఫాస్ 3 వ. లేక, ౬ వ. చూర్ణమును గాని మ్యాగ్నెసియా ఫాస్ 3 వ. లేక ౬ వ. చూర్ణమును గాని యీయవలయును.

నరముల సంబంధమగు పురాతన వ్యాధికి క్యాలికేరియాఫాస్ ౬ వ. చూర్ణము నీయవలయును.

జావ, గంజి, పాలు మొదలగువానిని ద్రావుచుండవలయును. ఫలములను దినుట మంచిది. మద్యమును ద్రావగూడదు. ఇది వచ్చినప్పుడు

కదలమెదల కుండవలయును. నడువగూడదు. నొప్పులు గలకీళ్ల కే విధమగు పనిని గల్పించఁ గూడదు. తోమించుకొనుట, విరచుట పనికి రాదు.

(౧౭) కురుపులు - సెగగడ్డలు

సాధారణముగ రోమకూపములయందు చిన్న చిన్న కురుపులు లేచును. ఈకురుపులు రెండువిధములు. యౌవనకాలమందు స్త్రీ పురుషులకు లేచు కురుపులను మొటిమ లని చెప్పుదురు. వానిని గూర్చి మరియొకచోట చెప్పియున్నాము. రోమకూపములయందు చిన్న చిన్న కురుపులు లేచును. అవి మిక్కిలి బాధ పెట్టును. ఇవి యొకచోటనే యనేకకురుపులు లేచును. అప్పుడు మిక్కిలి బాధగ నుండును. శరీరాస్వస్థతవలనను, రక్తసంచలనమందు వ్యాఘాతము గలుగుటవలనను, భోజనపదార్థముల యందలి దోషమువలనను, గ్రీష్మకాలమందు

నను, వర్షకాలమందునను, కురుపులు, సెగ గడ్డలు లేచుచుండును.

చికిత్స:—క్యాలి కేరియా ఫ్లవరు ౬ మ. చూర్ణమును, సాయిలీసియా ౬ మ. చూర్ణమును గలిపి, రెండుగంటల కొకమా ఱీయవలయును. మరియు వీనిని కురుపులమీాద బట్టించవలయును. కాపుపట్టవలయును. ఇందువలన కురుపులు నయమగును. క్యాలి కేరియాసల్ఫు ౧౨ మ. చూర్ణమును, సాయిలీసియా ౧౨ మ. చూర్ణమును పర్యాయక్రమముగ దినమునకు నాలుగుమాఱులు పుచ్చుకొనినయెడల క్రొత్త కురుపులు లేచుట యాగిపోవును.

అజీర్ణమును గలిగించు పదార్థమును దినవలదు.

(౧౮) గర్భిణి

గర్భిణీస్త్రీలు పలువిధములగు వ్యాధులవలన బీడింపబడు చుందురు. వారికి వచ్చు వ్యాధు

లనుబట్టి చికిత్స చేయుచుండవలయును. జ్వరము వచ్చిన, జ్వరమునకు చేయు చికిత్స చేయవలయును.

చికిత్స:—మలబద్ధక ముండినయెడల క్యాలికేరియాప్లవరు నీయవలయును. ఆకలిలేకుండిన యెడల క్యాలికేరియా ఫాస్ నీయవలయును.

ఆమ్లు ముండినయెడల, క్యాలికేరియాఫాస్‌ను నెట్రంఫాస్‌ను, పర్యాయక్రమమున వాడవలయును.

గర్భసంచార మైనప్పటినుండియు, రోగికి క్యాలికేరియా ఫాస్ ౬ మ. చూర్ణమును దినమునకు రెండు మోతాదు లిచ్చుచుండుటవలన మిక్కిలి మేలుగలుగును. ఏలయనిన గర్భిణి స్త్రీలలో గొందఱు, కచ్చికలు, మంటిగడ్డలు మొదలగువానిని దినుచుందురు. అందువలన శిశువుయొక్క ఎముకలను బెంచుటకు ముఖ్యావశ్యకమగు క్యాలికేరియాఫాస్, అను పదా

ర్థము తఱిగిపోవును. కావున క్యాలికేరియా ఫాస్‌ను ప్రతిదినమును దినుచుండుట మంచిది.

గర్భిణిస్త్రీకి స్నాయువులు దుర్బలత నొంద కుండుటకు, ఆఱవమాసము వచ్చినప్పటి నుండియు, కాలీఫాస్ ౬ వ. చూర్ణమును దినమునకు రెండు మోతాదు లీయవలయును. అందువలన దృఢకాయుడును, మేధావియు నగు సంతానము గలుగును. మఱియు సుఖప్రసవమగును.

గర్భిణిస్త్రీ కోరు పదార్థములను బెట్టుచుండవలయును. బలమునిచ్చు పదార్థములను దినుచుండుట మంచిది. అజీర్ణమును గలిగించు పదార్థములను బెట్టజనదు. గర్భిణి స్త్రీ లెప్పుడును, ఆనందముగ కాలమును గడపుచుండవలయును. దుఃఖముగాని మనోవేదనగాని యుండగూడదు.

## (౧౬) గర్భస్రావము

పూర్తిగ నవమాసములు నిండక పూర్వము,

అనగా, ఏడెనిమిదిమాసములకే ప్రసవించిన యెడల దానిని గర్భస్రావ మందురు. రెండు మూడుమాసములకే గర్భస్రావమైనయెడల మిక్కిలి రక్తముగాఱును. ఏడవమాసమందు గర్భస్రావమైనను శిశువులు తఱచుగ బ్రదుకుచుందురు.

చికిత్స:—తఱచుగ గర్భస్రావమగుచుండు వారలు గర్భోత్పత్తి నుండియు, కాలీఫాస్ ౬ మ. చూర్ణమును రెండుమోతాదులు పుచ్చుకొనుచుండవలయును. దీనితోడ నప్పుడప్పుడు క్యాలికేరియాప్లవరు ౬ మ. చూర్ణమును దినమునకు రెండుమాఱులు దినవలయును.

గర్భస్రావమైనయెడల క్యాలికేరియాప్లవరు ౬ మ. చూర్ణమును, ఫెరంఫాస్ ౬ మ. చూర్ణమును పర్యాయక్రమముగ దినవలయును. అందువలన రక్తస్రావము కట్టుపడును.

రోగి మిక్కిలి దుర్బలమై యుండినచో ఫెరంఫాస్‌తోడ, కాలీఫాస్ ౬ మ. చూర్ణము గలిపి పుచ్చుకొనవలయును.

బలమువచ్చుటకుగాను, క్యాలికేరియాఫాస్, ౬ మ. చూర్ణమును దినమునకు రెండుమోతాదులు దినవలయును.

గర్భస్రావమయిన పిమ్మట ఫెరంఫాస్ 3 మ. చూర్ణమును, ముప్పది గ్రేయిను లొక పౌను వేడినీటియందు గలిపి, ఆనీటితోడ జననేంద్రియము లోపలను వెలుపలను గడుగవలయును.

రోగిని కదలమెదల నియ్యగూడదు. పరుండబెట్టవలయును.

జావ, గంజి, సగ్గుబియ్యపుజావ, పాలు, రసముండిన పండ్లను దినవచ్చును.

## (౨౦) గవదబిళ్లలు

గవదబిళ్లలు మిక్కిలి తీపుగను, పోటుగ నుండును. కొందఱకు దీనితోడ జ్వరముగూడ వచ్చుచుండును. ఇవి గనబడినంతనే జాగ్రత్తగ నౌషధమును సేవించినయెడల త్వరలో నది యాగిపోవును. లేనియెడల పెద్దవై చీముపట్టి ప్రమాదకర మగును. సాధారణముగ గవద బిళ్లలు పిల్లలకుమాత్రమే గట్టుచుండును.

ప్రథమమున ఫెరంఫాస్ ౬ వ. చూర్ణమును, కాలీమూరు ౬ వ. చూర్ణమును రెండుగంటల కొకమాఱు పర్యాయక్రమముగ నియ్యవల యును. ఫెరంఫాస్ 3 వ. చూర్ణమును గాని కాలిమూరు ౬ వ. చూర్ణమునుగాని, తేనెతో గలిపి బిళ్లలమీద పట్టువేయవలయును. ఇట్లు ఒనర్చుటవలన మూడునాలుగుదినములలో బిళ్లలు కరగి పోవును.

**చికిత్స :**—ఫెరంఫాస్ ౬ మ. చూర్ణమును మూడు నాలుగుమారులు పుచ్చుకొనవలయును. దీనితో కాలీఫాస్ ౬ మ. చూర్ణమును గలిపి, పర్యాయక్రమముగ గాని పుచ్చుకొనిన శీఘ్రముగ గుణము గనబడును.

ఈరోగికి రక్తవిహీనమై యుండిన యెడల క్యాల్కేరియాఫాస్ ౬ మ. చూర్ణమును, రోజునకు నాలుగయిదుమారు లీయవలయును.

మెట్లెక్కునప్పుడు గుండెలయందు దడ యుండినయెడల, నెట్రంమ్యూర్ ౧౨ మ. చూర్ణమును రోజునకు నాలుగయిదుమారు లీయవలయును.

కొంతమందికి కాలీసల్ఫువలన నయమగును. కాలీసల్ఫుతోడ ఫెరంఫాస్ ౬ మ. చూర్ణమును పర్యాయక్రమముగ నీయవలయును.

బలమైనట్టి యాహారమును దినవలయును. ఉదరమందు వాయువు చేరగూడదు. కావున

నజీర్ణ పదార్థములను దినరాదు. ఒంటికి చెమట పట్టునటులు నడచుట గాని, మరి యే యితర కార్యములను గాని చేయజనదు. శరీరమునకు రక్తము బట్టునటులు చూడవలయును.

## (౨౨) గోరింతదగ్గు

చిన్నపిల్లలకు నీదగ్గు వచ్చుచుండును. దగ్గునప్పు డొక విధమగు శబ్దము వినవచ్చును. తిన్న పదార్థములు కళ్లెతోడ క్రక్కుకొను చుందురు.

చికిత్స:—మ్యాగ్నెసియా ఫాస్ ౬ మ. చూర్ణమును రెండుగంటల కొకమారు వేడినీళ్ల తోడ నీయవలయును. దీనితోడ పర్యాయక్రమముగ కాలీమూరును ఇచ్చినయెడల వెంటనే నయమగును.

ఈదగ్గుగల బాలురకు క్యాలికేరియాఫాస్ ౬ మ. చూర్ణమును, ఉదయము, సాయంత్ర

ములయందు రెండుమోతాదు లీయవలయును.

ప్లానలు చాక్కాను దొడుగవలయును. అతి సులభముగ జీర్ణమగు పదార్థములను మాత్రమే తిననిచ్చుట మంచిది.

(౨౩) గోరుచుట్టు

వేళ్ల చివర కురుపు లేచును. దానిని గోరుచుట్టు అని పిలిచెదరు. ఈకురుపు మిక్కిలిబాధ పెట్టును. ఇది త్వరగా నయముగాని యెడల నలుప్రక్కల ప్రాకును.

చికిత్స:—ఫెరంఫాస్ ౬ మ. చూర్ణమును, సాయిలీసియా ౧౨ మ. చూర్ణమును, పర్యాయ క్రమముగ గంట కొకమారు పుచ్చుకొనవలయును. ఇందువలన నయమగును.

ఫెరంఫాస్ 3 మ. చూర్ణమును తడిపి గోరుచుట్టుమీాద పూసి ఫెరంఫాస్ నీటితో దడిపిన గుడ్డనువేసి కట్టవలయును. ఇందువలన పోట్లు

**చికిత్స** :—ఫెరంఫాస్ ౬ వ. చూర్ణమును రెండుగంటల కొకమారు పుచ్చుకొనవలయును. మరియు ఫెరంఫాస్ ౩ వ. చూర్ణము ౩౦ గ్రెయిను లొకయవున్సు గ్లిసరైనునందు గలిపి దానిని గొంతునందు రెండు మూడు మారులు రాయవలయును. పుండు పడినయెడల కాలీమూరు ౬ వ. చూర్ణమును ౨ గంటల కొక మారు తినవలయును.

ఇది దీర్ఘవ్యాధి యైనయెడల క్యాలికేరియాఫాస్ ౬. వ. చూర్ణమును రోజునకు రెండుమారులు పుచ్చుకొనవలయును.

వ్యాధి తరుణముం దున్నప్పుడు, గొంతు చుట్టు ఫ్లానలుగుడ్డను చుట్టుకొని యుండుట మంచిది.

(౨౫) గొంతునొప్పి - బొంగురువోవుట

గొంతునందుండు శ్లేష్మకోశము నల్లపడును. అప్పు డచ్చట పుండుపడుటగాని యా స్థానము

పుండువలె నగుటగాని సంభవించును. అప్పు డుమ్మివేయుటకును, ఏదయిన తినుటకును మిక్కిలి కష్టముగ నుండును. గొంతునందు తీపు, పోటు, జ్వరముగూడ నుండును. ఇది కొందఱకు తీవ్రమై గొంతునందలి పుండు నలు దిక్కుల వ్యాపించును. అప్పుడు జ్వరము మిక్కుటముగ వచ్చును.

చికిత్స:—కాలీమూరు ౬ వ. చూర్ణమును, దినమునకు ముమ్మారు సేవించినయెడల గొంతు బొంగురుపోవును. పుండు నయమగును.

ప్రథమావస్థయందు ఫెరంఫాస్ ౬ వ. చూర్ణమును రెండు మూడుగంటల కొకమారు పుచ్చుకొనినయెడల నయమగును.

కాలీమూరును 3 వ. చూర్ణమును గాని, ఫెరంఫాస్ 3 వ. చూర్ణమును గాని, 30 గ్రెయిను లొకయవున్సు గ్లిసరైనునందు గలిపి, పుడకకు దూదిచుట్టి, యా గ్లిసరైనును దినము

నకు నాలు గైదుమారులు గొంతులోపల రాయవలయును.

గొంతుచుట్టు ఫ్లానలుగుడ్డను చుట్టుకొన వలయును. అప్పుడప్పుడు కాపు పట్టవలయును. తేలికపదార్థములను దినుచుండవలయును.

(౨౬) చనుకుదురు

పిల్లలకు పాలీయనప్పుడుగాని, గర్భిణితో నున్నప్పుడుగాని, స్తనములయందధికముగ పాలు చేరును. అందువలన తీపుపుట్టును. సాధారణముగ నది చికిత్సలేకయే నయమగును. కాని కొంతమందికి స్తనములు వాచును. గడ్డకట్టును. అందువలన బాధ యుండుటయే గాక జ్వరము గూడ వచ్చును.

చికిత్స:—ప్రథమావస్థయందు, నెట్రంఫాస్ ౬ మ. చూర్ణమును, ఫెరంఫాస్ ౬ మ. చూర్ణ

మును గలిపి రెండుమూడు గంటల కొకమారు పుచ్చుకొనవలయును.

ఫెరంఫాస్ 3 మ. చూర్ణము 30 గ్రయిను లొక యవున్సు వేడినీటియందు గలిపి దానిని జనుకుదురునకు బూయవలయును.

స్తనములు మిక్కిలి వాచుటయు, దాని తోడ జ్వర ముండినయెడల, ఫెరంఫాస్ తోడ కాలీమూరును పర్యాయ క్రమముగ బుచ్చుకొనవలయును. జ్వరము లేనియెడల కాలీమూరు ౬ మ. చూర్ణమును బుచ్చుకొనిన జాలును.

ఇందువలనగూడ తగ్గక చనుకుదురు, కురుపగునని తోచినయెడల సాయిలీసియా ౬ మ. చూర్ణమును మూడుగంటల కొకమారు పుచ్చుకొనవలయును. మరియు 3 మ. చూర్ణము నీళ్లతో గలిపి స్తనములమీద బట్టించవలయును.

స్తనములను గదలకుండునట్లు బిగించి కట్టు కట్టవలయును.

## (౨౭) చిడుము - తీట

ఇది మిక్కిలి యసహ్యాకరమగు వ్యాధి. సులభముగ నయముగాదు. సాధారణముగ నిది బాలకులకు వచ్చుచుండును. యువకులకు గూడ వచ్చును. అన్ని ఋతువులయందునను గన్పడును. కాని ముఖ్యముగ శరత్కాలమందు నను, శీతకాలమందునను బుట్టును. తీపివస్తువులను, అజీర్ణ పదార్థములను, క్రొవ్వానాను దినుట వలన నిది సంభవించును. ఇది యంటురోగము కావున నొకరినుండి మరియొకరికి వచ్చును.

చికిత్స:—శరీరమం దొకచోటగాని యనేక స్థలముల యందుగాని పొక్కులు లేచిన యెడల నెట్రంసల్ఫు 3 మ. లేక, ౬ మ. చూర్ణము లను రోజునకు రెండు మూడు మోతాదులను

బుచ్చుకొన వలయును. దీనిని వాసలయిను నందుగాని, గ్లిసరైనునందు గాని కలిపి శరీరము మీాద బట్టించవలయును.

పొక్కులు మిక్కిలి చిన్నవై చీము లేకుండి నను, నల్లగనుండినను, నెట్రంమ్యూర్యారు, ౧౨ మ. లేక, ౩౦ మ. చూర్ణమును, దినమునకు మూడు నాలుగు మోతాదులు పుచ్చుకొన వలయును. దీనిని శరీరముమీాద బట్టించుకొనవలయును.

పొక్కులయందు చీ ముండినయెడల నెట్రం ఫాస్‌ను, సయిలీసియాను దినవలయును.

కాలీసల్ఫు ౧౨ మ. చూర్ణమును దినుట వలనను, శరీరమునిూద బట్టించుకొనుట వలనను కొందఱకు నయమగును.

కాలీమూరును దినుటవలన కొందరికి నయ మగును.

కురుపులను చిదిపి వానియందలి రసమును నొత్తినపిమ్మట మందు పట్టించవలయును. కురు

పులకు తైలము రాయుట మంచిది. చేపలు తీయని పదార్థములు, కూరగాయలు, తినరాదు. ఇది త్వరలో నయముగాదు. కావున తొందర పడక కొన్ని దినములు వరుసగ మందును వాడ వలయును.

(౨౮) చిన్నబిడ్డగుణము - నరములు లాగికొనిపోవుట

పలువిధములగు రోగములతోడ, చిన్నబిడ్డ గుణమును, నరములు లాగికొని పోవుటయు సంభవించును. కడుపునందు పురుగులుండినను, తలయందు రక్త మెక్కుడుగ జేరినను, ఇస్టీరియా వ్యాధివలనను, పిల్లలకు పండ్లువచ్చునప్పుడును, నీవ్యాధి గలుగును. కాళ్లు చేతులు వంకరలు పోవుచు, కడుపుతో నీవ్యాధి ప్రారంభమై కొన్ని నిముసములలో బిడ్డలు కొయ్యవలె బిగుసు కొనిపోదురు. సాధారణముగ విశేషజ్వరము వచ్చినప్పు డీవ్యాధి గలుగుచుండును.

చికిత్స:—చిన్నబిడ్డ గుణమునకును, నర ములు లాగికొనిపోవు రోగమునకును మ్యాగ్నిసియాఫాస్ ప్రధానమగు ఔషధము. కావున నీ చూర్ణము 3 మ. వేడినీళ్లతోడ ౧౫ నిము సముల కొకమాఱుగాని, 30 నిముసముల కొక మాఱుగాని యీయవలయును.

మ్యాగ్నిసియాఫాస్ వలన గుణము గను పడనియెడల, క్యాలికేరియాఫాస్ ౬ మ. చూర్ణ మును, మ్యాగ్నిసియాఫాస్ తోడ గలిపికాని, పర్యాయక్రమముగా గాని యీయవలయును.

కడుపులో బురుగు లుండుటవలన నీ వ్యాధి గలిగినదని తోచినయెడల, మ్యాగ్నిసియాఫాస్ తోడ నెట్రంఫాస్ 3 మ. చూర్ణమును పది నేను నిముసములు లేక అరగంట కొకమారు పర్యాయక్రమముగా గాని, కలిపిగాని యీయ వలయును.

పిల్లలకు పండ్లువచ్చునప్పు డీ వ్యాధి గలిగిన యెడల క్యాలికేరియాఫాస్ నీయవలయును. జ్వరముండినయెడల దానితోడ ఫెరంఫాస్ ఉమ. చూర్ణమును పర్యాయక్రమముగ నియవల యును. ఇంనువలన గుణము గనబడనియెడల మ్యాగ్నెసియాఫాస్‌ను, క్యాలికేరియాఫాస్‌ను పర్యాయక్రమముగ వాడవలయును.

ఈవ్యాధి వచ్చినప్పుడు మందు ద్రావని యెడల, చలినీళ్లతోడ తలను తడిపి తడిగుడ్డను మోముమీద వేయుచుండవలయును. చేతులు కాళ్లను వేడినీళ్లయం దుంచవలయును. నాలుక మీద పైనజెప్పిన మందులను రాయవలయును.

కొంతమందికి యీ వ్యాధి వచ్చినతర్వాత జ్వరమువచ్చును. అప్పుడు జ్వరమునకు మందు నీయవలయును.

పథ్యము:—తల్లి పాలు శ్రేష్ఠము. లేనియెడల ఆవుపా లీయవలయును.

## (౨౫) చెవుడు

పలుకారణములవలన నీవ్యాధి గలుగుచున్నది. బాల్యమున చెవియందు చీము గారుట వలనను, గులిమి మిక్కిలి చేరుటవలనను, మితిమించి క్వాయినాను దినుటవలనను, చెవుడు వచ్చును. శ్రవణేంద్రియమందలి శ్రవణశక్తికి పక్షవాతము వచ్చుటవలనను, కర్ణ పుట ము శుష్కించుటవలన గూడ చెవుడు వచ్చును.

చికిత్స:—కర్ణపుటమున చిల్లులు పడిన యెడల బధిరత్వము సంభవించును. కాని యది నయముగాదు.

చెవినుండి చీముగారుచుండినను, ఆచీము మిక్కిలి దుర్గంధయుతమై యుండినను, సాయిలీసియా, 3 మ. లేక, ౬ మ. చూర్ణమును దినమునకు రెండు మూడు మారులు పుచ్చుకొనవలయును.

జలుబు చేయుటవలన చెవినుండి చీము గారుచుండినను, ఆచీమునం దేవిధమగు దుర్వాసన లేకుండినను, కాలీమూరు ౬. వ చూర్ణమును రోజునకు ముమ్మారు సేవించవలయును.

మిక్కుటముగ క్వయినాను దినుటవలన చెవుడు వచ్చినయెడల నెట్రంమ్యూరు ౬ వ. చూర్ణమును బుచ్చుకొనవలయును.

పక్షవాతమువలన వచ్చినచో కాలీఫాస్ ౬. వ. చూర్ణమును దినమునకు నాలుగుమారులు తినవలయును.

చెవియందు గ్లిసరైనుతోడ దినుచుండు మందును గలిపి పోయవలయును. గులిమి చేరుట వలన చెవుడు వచ్చిన యెడల, గులిమిని తీసివేసి దానియందు గ్లిసరైనునుగాని కొంచెము వేడిగ నుండు చమురునుగాని పోయవలయును. మరియు చెవియందు గాలిచొరకుండునటుల దూదిని బెట్టవలయును.

## (30) చెవినుండి చీము గారుట

సాధారణముగ, పిల్లలకు చెవులనుండి చీము గారుచుండును. సకృత్తుగా పెద్ద వయసునందు గూడ చెవులనుండి చీముగారుచుండును. ఇందు వలన గొందఱు చెముడివా రగుదురు.

చికిత్స:—సాయిలీసియా 3 మ. చూర్ణ మును గాని, ౬ మ. చూర్ణమును గాని దినము నకు మూడు నాలుగుమారులు లీయవలయును. అందువలన చీముగారుట యాగిపోవును. కొంద ఱకు సాయిలీసియా ౧౨ లేక, 30 మ. చూర్ణ ముల నీయవలసివచ్చును.

సాయిలీసియావలన నయముగాని యెడల, క్యాలికేరియా ఫ్లవరు ౬ మ. చూర్ణమును, క్యాలికేరియా ఫాస్ ౬మ. చూర్ణమును, సాయి లీసియాతోడ పర్యాయక్రమముగ వాడవల యును. చెవియందు తెలుపుగను పెక్కులుండిన

యెడల కాలీమూరు ౬ మ. చూర్ణమును మ్యా గ్నెసియా ఫాస్ ౬ మ. చూర్ణమును పర్యాయ క్రమముగ వాడవలయును.

చెవియందు పుడకల పెట్టి కెలుకుట మానవలయును. పిచికారితోడ చెవిని గడుగకూడదు. మందు చాలదినములు దినవలయును. శరీరమునకు బలము పట్టు పదార్థములను దినుచుండవలయును.

(౩౧) జలుబు

శరీరమం దేభాగమున శీతగాలి తగిలినను, జలుబు చేయును. సాధారణముగ తలకు చలిగాలి తగులుటవలన జలుబు చేసి ముక్కు, కన్నుల వెంట నీరు గారుచుండును. తలబరువుగనుండును. విరేచనబద్ధక ముండును. నోటిరుచి చెడును. ఏది దినుటకును నిచ్ఛయుండదు. ఆకలిమందగించును. పులుసుగాని, లవణ మిశ్రితపదార్థములను గాని దినవలయు నను కోరిక యుండును.

చికిత్స :—ప్రథమమున ఫెరంపాస్ ౬ వ. చూర్ణమును, నెట్రంమ్యూర్యారు ౬ వ. చూర్ణమును పర్యాయక్రమముగ రెండుగంటల కొకమారు బుచ్చుకొనినయెడల నయమగును.

అవసర ముండినయెడల కాలీమూరునుగూడ సేవించవలయును.

కొంతవడి వేడినీళ్లయందు కాళ్లు పెట్టియుంచుట మంచిది. పచ్చళమును గప్పుకొని శరీరమునకు చెమటపట్టునట్లు చేయవలయును.

రొట్టెను, అన్నమును దినవచ్చును. వేడి పాలను త్రాగవలయును. ఉప్పువేసి వండిన పదార్థములనుగూడ దినవచ్చును.

## (౩౨) జిగటవిరేచనములు (ఆమాశయము)

## ( డిసెంట్రీ )

జిగటవిరేచనములు, రక్తమిశ్రిత జిగటవిరేచనములనియు,ఆమాశయమనియు రెండువిధములు.

ఈ వ్యాధివలన రోగి మాటిమాటికి మలమును విసర్జింపుచుండును. ఒకప్పుడు మలము పడకుండగనే, కేవలము, ఆమము మాత్రము బడుచుండును. అనగా దట్టమగు శ్లేష్మము బడుచుండును. కొందరికి ఆమముతోడ నెత్తురుగూడ బడుచుండును. విరేచనములు ప్రారంభించినప్పుడు కొందరికి జ్వరముగూడ వచ్చును. మలత్యాగ కాలమందు కడుపునొప్పి, పోట్లుండును. ఇది ప్రారంభమందు నయముగానియెడల పురాతనవ్యాధిగ మారును. జలుబుచేయుట వలనను, అజీర్ణమును జేయు పదార్థములను దినుటవలనను, తేమనేలలయందు నివసించుచుండుట వలనను, ఈ వ్యాధి పుట్టుచుండును.

చికిత్స:—ఈవ్యాధికి ప్రధానౌషధము కాలీమూరు. శ్లేష్మము పడుచుండినను, నెత్తురు పడుచుండినను, కాలీమూరు ౬ మ. చూర్ణమును, రెండుగంటల కొకమా రీయవలయును. దీని

వలన నెత్తురు చీముపడుట యాగిపోవును.

మలమందు మిక్కిలిగ నెత్తురు కలిసియుండి నను, లేక నెత్తురుమాత్రమే కారుచుండినను, కాలీమూరుతోడ, కాలీఫాస్ ౬ వ. చూర్ణ మును గాని, ఫేరంఫాస్ ౬ వ. చూర్ణమును గాని, పర్యాయక్రమముగ వాడవలయును.

జ్వర ముండినయెడల ఫెరంఫాస్, కాలీమూ రును పర్యాయక్రమముగ వాడవలయును.

మలము ఆకుపచ్చవర్ణముగ నుండినను, దాని యం దధికశ్లేష్మ ముండినను, నెట్రంసల్ఫు ౬వ. చూర్ణము నీయవలయును.

రక్తముతోడ చీము పడుచుండిన యెడల క్యాలికేరియాసల్ఫు 3 వ. చూర్ణము నుప యోగించవలయును. ఈ వ్యాధి ఒంట జిటించిన యెడల క్యాలికేరియాసల్ఫు ౧౨ వ. చూర్ణ మును వాడుచుండవలయును.

శరీరమునకు బలము పట్టుటకుగాను, క్యాలి కేరియాఫాస్ ౬ ఎు. చూర్ణమును రోజుకు రెండుమారులు దినవలయును.

మెత్తగా నుడికిన పాతబియ్యపు అన్నమును దినవచ్చును. పాలు, మజ్జిగ, గంజి, పండ్లరసము, కందికట్టును దినవచ్చును. స్నానలు చొక్కాను దొడుగుకొని యుండవలయును.

## (33) జ్వరము

### రోజువిడిచి రోజువచ్చు జ్వరము

ఈ జ్వరమును మలేరియాజ్వరమనిగూడ చెప్పుచుందురు. చలితోడ జ్వరమువచ్చును. జ్వరమువచ్చినప్పు డతి దాహముండును. తల నొప్పి పిత్త వమన మగుచుండును. జ్వరము విడచునప్పుడు, శరీరమంతయు జ్వాలగానుండి, చెమటలుబట్టి జ్వరము విడుచును. ఈ జ్వరము కొందఱకు ప్రతిదినమును, రోజువిడిచి రోజును,

కొందఱకు నియమము లేకుండగను వచ్చు చుండును.

చికిత్స:—ఈ జ్వరములకు ప్రధానౌషధము నెట్రంసల్ఫు. ఈమందు 3 మ. చూర్ణమును జ్వరమున్నప్పుడును, లేనప్పుడును, వాడుచుండ వలయును. ఉదయముననే జ్వరము వచ్చుచుం డినను, కక్కులు విరేచనము లుండినయెడల నీ యౌషధముతోడనే నయమగును.

జ్వరము ౧౧ గంటలప్పుడు వచ్చుట, లేక, అప్పుడు వృద్ధిపొందుచుండినయెడల దానికి నెట్రంమ్యూర్, 3 మ. లేక, ౬ మ. చూర్ణమును. వాడవలయును. ఈజ్వరమున కిదియే ప్రధా నౌషధము. కావున దీనిని నెట్రంసల్ఫుతోడ పర్యాయక్రమముగ నిచ్చుచుండవలయును.

సాయంత్రము ౫ గంటలకు జ్వరము వచ్చు చుండినయెడల కాలిసల్ఫు ౬ మ. చూర్ణమును నెట్రంసల్ఫుతోడ గలిపి యీయవలయును.

రాత్రి రెండుజాము లప్పుడు గాని, పౌర్ణమి లేక యమావాస్యలయందు జ్వరము వచ్చు చుండినయెడల నెట్రంసల్ఫును, సయిలీసియాను, గలిపి యీయవలయును. జ్వరముతోఁడ కార్జ మిచ్చిన గాని, నాలుక మలినావృతమై యుండిన గాని, కాలీమూరును, నెట్రంసల్ఫుతోఁడ పర్యాయ క్రమముగ నీయవలయును.

జ్వరమప్పుడు కన్ను లెర్రపడినను, తల యందు రక్త మెక్కుడుగ జేరినను, ప్లీహాకార్జ ములకడ వేదన యుండినను, ఫెరంఫాస్ ౬ మ. చూర్ణమును వాడవలయును.

జ్వరమున్నప్పుడు లేనప్పుడు గూడ మందును వాడవలయును.

## (౩౮) జ్వరము

### విరామరహిత జ్వరము (రెమిటెంటు ఫీవరు)

ఇది గూడ మలేరియా జనితమగు జ్వరమై యున్నది. ఈ జ్వర మెచ్చుచుండును తగ్గు

చుండును. కాని పూర్తిగ విడువదు. దీనితోడ, కార్జము, ప్లీహ మొదలగు యంత్రము లుబ్బు చుండును. ఈ జ్వరము ౧౪ దినములకు గాని లేక ౨౧ దినమునకు గాని నయమగును. కొందఱి కింకను చాలదినములవఱ కుండును. జ్వరము వచ్చినప్పుడు పిచ్చిగ మాట్లాడుదురు. వికార లక్షణము లుండును.

చికిత్స:— ఫెరంఫాస్ ౬ వ. చూర్ణమును, నెట్రంసల్ఫు ౬ వ. చూర్ణమును, రెండుగంటల కొకమా రిచ్చుచుండవలయును.

నరముల సంబంధమగు బలహీనత యెక్కుడుగ నుండిన యెడల ఫెరంఫాస్‌తోడ కాలీఫాస్‌ను గలుపవలయును.

శరీరచర్మము శుష్కించినటు లుండినను, కఠినముగ నుండినను జ్వరము సాయంత్రమునందు వృద్ధియగుచుండిన యెడల నెట్రంసల్ఫుతోడ కాలీసల్ఫును గలిపి యీయవలయును.

కార్జములదగ్గరతీపు, నాలుక తెలుపు, మయ లావృతమై యుండిన యెడలను, విరేచనబద్ధక ముండినను కాలీమూరును గూడ నీయవల యును. ఇందువలన జ్వరము తరుగును.

ఈ జ్వరమునకు డాక్టరుల సహాయమును బొందుట మంచిది.

## (౩౫) జ్వరము

శరీరమందలి వేడిమి వృద్ధియైనయెడల దానిని జ్వరమందురు. పలువిధరోగములతోడ జ్వరము వచ్చుచుండును. రక్తము చెడుటవలన జ్వరము వచ్చును. కొన్ని విషమజ్వరములు, జలుబుచే యుటవలనను, ఎండయందు దిరుగుటవలనగూడ జ్వరమువచ్చును. కావున జ్వరమునుబట్టి చికిత్స చేయవలయును. కాని జ్వరములన్నిటికిని సాధా రణనియమము లొకవిధముగనే యుండును.

చికిత్స:— సాధారణ జ్వరము లన్నిటికిని ప్రధానౌషధము ఫెరంఫాస్. కావున ౩ మ.

చూర్ణమునుగాని, ౬ మ. చూర్ణమును గాని రెండుమూడుగంటల కొకమా రిచ్చినయెడల, శరీరమంతయు చమటబట్టి జ్వరము తగ్గిపోవును.

ఫెరంఫాస్‌ను బుచ్చుకొనుటవలన జ్వరము తరుగనియెడల కాలీసల్ఫు ౬ మ. చూర్ణమును, ఫెరంఫాస్‌తోడ, పర్యాయక్రమముగ నీయవలయును.

జ్వరముతోడ విరేచనబద్ధకముండినను, నాలుక తెల్లని మలినావృతమై యుండినను, కాలిమూరు ౬ మ. చూర్ణమును వేడినీటితోడ రెండుగంటల కొకమా రిచ్చినయెడల ఝూడించి విరేచనమగును.

జ్వరము పగలు వృద్ధియగుచుండినను, జలుబుండినను, ముక్కువెంట నీరుకారుచుండినను, ఎండయందు దిరుగుటవలన జ్వరమువచ్చినను, నెట్రంమ్యూరు ౬ మ. చూర్ణమును రెండు

మూడు గంటల కొకమారీయవలయును. దీని వలన జ్వరము నయమగును.

అమావాస్య పూర్ణిమలయందు జ్వరము వచ్చుచుండినయెడల సాయిలీసియా ౧౨ మ. చూర్ణమును, రెండుగంటల కొకమారీయవలయును. జ్వరము వచ్చినప్పుడు నిశ్శబ్ద మగు గృహమందు శయనించుట మంచిది. దాహమైన యెడల వేడినీటిని గాని చలినీటిని గాని యీయవచ్చును. పాలు, జావ, గంజి, బార్లీ జావ మొదలగువానిని బుచ్చుకొనవచ్చును. మిగిలిన జ్వరముల చికిత్సావిధానమును గురించి వ్రాసినచోట్ల జూడవలయును.

## (౩౬) తలనొప్పి

తలయంతయుగాని, యొకపార్శ్వమందుగాని నొప్పి యుండినయెడల దానిని తలనొప్పి యందురు. చలిగాలి తగులుటవలనను, రక్తాధిక్యము

వలనను, విరేచన బద్ధకమువలనను, మానసిక శారీర బలహీనమువలనను, మిక్కుటమగు పరిశ్రమవలనను, నరముల దౌర్బల్యమువలనను, తలనొప్పి పుట్టుచుండును.

చికిత్స:—చలిగాలి తగులుటవలన తలనొప్పి పుట్టినయెడల, ముక్కువెంట నీరు గారుచుండును. తల బరువుగ నుండును. దానికి ఫెరంఫాస్ ౬ మ. చూర్ణమును, నెట్రంమ్యూర్ ౬ మ. చూర్ణమును, పర్యాయ క్రమముగ రెండు మూడు గంటల కొకమా రీయవలయును. కాళ్లు వేడినీళ్లయందు బెట్టి కొంతవడియుంచవలయును.

రక్తాధిక్యమువలన తలనొప్పి పుట్టినయెడల, తల యదరుచుండును. కండ్లు, ముఖ మెఱ్ఱబడును. అప్పుడు ఫెరంఫాస్ ౬ మ. చూర్ణమును నరగంట కొకమా రీయవలయును. కాళ్లను, వేడినీళ్లయం దుంచవలయును. చలినీళ్లతోడ తలను గడుగుకొనవలయును.

నరముల దుర్బలత్వమువలనను, మానసిక పరిశ్రమవలనను, దుఃఖము మొదలగువాని వలనను, తలనొప్పి వచ్చినయెడల, నప్పుడు సాధారణముగ నిద్దురపట్టదు. దానికి కాలీఫాస్ ౬ మ. చూర్ణము నీయవలయును. ఫెరంఫాస్ ౧౨ మ. చూర్ణమునుగూడ, పర్యాయక్రమముగ నిచ్చుట మంచిది.

విరేచనబద్ధక ముండినయెడల నెట్రంమ్యూరు నీయవలయును.

పైత్యాధిక్యమువలన నిది గలిగినయెడల కాలీమూరు ౬ మ. ను, లేక నెట్రంసల్ఫు 3 మ. లేక, ౬ మ. చూర్ణముల నిచ్చుట యుత్తమము.

వాతమువలన నైనయెడల, నెట్రంఫాస్, కాలీఫాస్‌లను పర్యాయక్రమముగ నీయవలయును.

సాయంత్రపు వేళలయందు తలనొప్పి యెక్కుడైనయెడల కాలీసల్ఫు ౬ మ. చూర్ణమును, కాలీఫాస్ ౬ మ. చూర్ణమునువాడుట మంచిది.

ఎండదెబ్బవలన గలిగినయెడల నెట్రంమ్యూరు నీయవలయును.

అజీర్ణమువలన గలిగిన యెడల ఫెరంఫాస్‌ను, నెట్రంఫాస్‌ను వాడవలయును.

ఈ వ్యాధివచ్చి త్వరలో దరిగిపోవుచుండును. తిరిగి వచ్చుచుండును.

ఎప్పుడును కారణమును గనిపెట్టి వైద్యమును చేయవలయును.

(32) తామర

ఇది చిన్నలకు పెద్దలకు గూడ వచ్చుచుండును. తామర మిక్కిలి యసహ్యాకరమగు వ్యాధి. కొంతమందికి తామరమీాద పొక్కులు లేచుచుండును. దానినుండి రసము గారుచుండును. ఇది పుట్టిన ప్రదేశమును బట్టి దీనపేర్లు గూడ మారుచుండును.

చికిత్స:—వర్షాకాలమందు వృద్ధియగు తామరకు ముఖ్యమగుమందు నెట్రంసల్ఫు. కావున

నీ మందు ౬ మ. చూర్ణమును రోజుకు రెండు మారులు పుచ్చుకొనవలయును. 3 మ. ను, నీటియందు గలిపి తామరమీద రాయవలయును.

ఎండకాలమందు వృద్ధియైనయెడల నెట్రం ముర్యారును బుచ్చుకొనవలయును. ౬ మ. చూర్ణమును నీటితోడ గలిపి పైన రాయవలయును.

కొందరికి కాలీసల్ఫువలనగూడ నయమగును.

వాసలయిను మొదలగువానిని తామరమీద రాయుచుండవలయును.

చేపలు మొదలగువానిని దినరాదు.

## (3౮) తెల్లబట్టరోగము

ఋతుస్రావ కాలమందునను, ఋతుద్వయము నకు మధ్యను, స్త్రీజననేంద్రియము నుండి తెల్లని పదార్థము స్రవించుచుండును. చలిగాలి తగులుట వలన బాలికలకు జననేంద్రియము నుండి

పలుచని స్రావము వచ్చుచుండును. శరీరమందలి రక్తము చెడుటవలనను, ఆమ్లము, అజీర్ణ రోగము లుండుటవలనను, చెమ్మనేలల నివసించుట వలనను, నీవ్యాధి గలుగుచున్నది.

చికిత్స:—కాలీమూరు ౬ మ. చూర్ణమును దినమునకు మూడునాలుగు మార్లులు బుచ్చుకొన వలయును. కొందరు పర్యాయ క్రమముగ క్యాలికేరియాఫాస్ ౬ మ. చూర్ణమును గూడ దినవలయును. రక్తవిహీనమైన రోగికి క్యాలికేరియా ఫాస్‌వలన మిక్కిలి మేలు గలుగును.

స్రావము నీళ్లవలె నగుచుండిన యెడల నెట్రంమ్యూరు ౧౨ మ. లేక, ३० మ. చూర్ణములను బుచ్చుకొన వలయును.

బాలికలకు కాలీమూరు ౬మ. చూర్ణమును రోజుకు మూడునాలుగుమారు లీయవలయును. మరియు కాలీమూరు ౧ మ. చూర్ణమును, ౧౫ గ్రెయినులు వేడినీళ్లయందు గలిపి జననేంద్రియ

మును గడుగ వలయును. పుండు పడినటులైన దానిమీద వాసలయినును రాయవలయును.

ఈ రోగము గలవారలు జననేంద్రియమును కడుగుకొనుచుండ వలయును. అతిసులభముగ జీర్ణించు పదార్థములను మాత్రమే దినవల యును. శీతల జలస్నానము మంచిది. పరిశ్రమ జనకమగు కార్యములను జేయుచుండ వల యును. విశుద్ధమగు వాయువునందు దిరుగుచుండ వలయును.

## (౩౯) తేళ్లు, కందిరీగలు, గండుచీమలు కుట్టుట

తేళ్లు, కందిరీగలు, దోమలు, గండుచీమలు, మొదలగునవి కుట్టినయెడల బాధ యుండును. ఇందు కొన్ని కుట్టినచోట నల్లపడును.

చికిత్స :— నెట్రంమ్యూర్యారు ౬ మ. చూర్ణ మును లోపలకు బుచ్చుకొన వలయును. నెట్రం

మ్యూరు 3 వ. చూర్ణమును కుట్టినచోట వేయవలయును.

పైవానివలన దఱుగనియెడల మ్యాగ్నెసియా ఫాస్‌ను గూడ పర్యాయక్రమముగ బుచ్చుకొనవలయును.

## (౪౦) తొంటినొప్పి

తొంటినొప్పి మిక్కిలిగనుండును. ఒకప్పుడు పోటుగూడనుండును. ఈ నొప్పి వచ్చుచుండును బోవుచుండును. నడచినను, కదలినను, మిక్కిలి బాధగానుండును. ఈనొప్పివలన గొందఱు కదల మెదలక పడుకొనియుండవలసినవార లగుదురు. అస్వాస్థ్యకర మగు గృహమందు నివసించుట వలనను, దెబ్బతగులుటవలనను, విరేచనబద్ధక ముండుటవలనను నిది సంభవించును.

చికిత్స:—పోటుగా నుండినను, ఒత్తిన నొప్పి యెక్కువయినను, ప్రారంభదశయందు ఫెరం

ఫాస్ ౬ మ. చూర్ణమును రెండుగంటల కొకమారీయవలయును.

నరముల సంబంధమగు వేదన యైనయెడల మ్యాగ్నిసియాఫాస్ ౬ మ. చూర్ణమును రెండు గంటల కొకమారీయవలయును. కొందఱకు దీని తోడ కాలీఫాస్ ౬ మ. చూర్ణమును, పర్యాయ క్రమముగ నిచ్చుట మంచిది.

ఆవిరి పట్టవలయును. ఝూడించి విరేచన మగు పదార్థములను మాత్రమే దినవలయును. తేమనేలల నివసింపజనదు. బలమైన యాహార మును భుజింపవలయును. నొప్పియున్న స్థలమున, నారగుడ్డను జుట్టవలయును.

## (౪౧) దగ్గు

ఈవ్యాధిని యింగ్లీషునందు 'కాఫ్' అనియు, జలుబుచేసి వచ్చు దగ్గును, కెటార్ అనియు జెప్పుదురు.

దగ్గనునది ప్రత్యేకవ్యాధి గాదు. వక్షస్థల మందలి పలువిధములగు రోగములయొక్క యొకలక్షణము మాత్రమే. దగ్గుతోడ శ్లేష్మము పడుచుండినయెడల కళ్లెదగ్గనియు, శ్లేష్మము పడనియెడల పొడిదగ్గనియు, చెప్పుదురు. గొంతునందుండు శ్లేష్మపుతిత్తు లుబ్బుటవలన దగ్గువచ్చును. జలుబుచేయుటవలనగూడ దగ్గు వచ్చును. ఈదగ్గునకు ముక్కు, కండ్లవెంట నీరుగారును. పాకస్థలియందు, 'కెటార్' అయిన యెడల అజీర్ణము గలుగును. నోట నీరు గారు చుండును.

చికిత్స:— పొడిదగ్గునకు ప్రధానౌషధము ఫెరంఫాస్. దీనిని ౬ మ. చూర్ణమును గాని ౧౨ మ. చూర్ణమును గాని, రెండుమూడు గం టల కొకమారు పుచ్చుకొనవలయును.

దగ్గునప్పుడు బాధయుండినయెడల మ్యాగ్నే సియాఫాస్ ౬ మ. చూర్ణమును వేడినీటియందు

గలిపి దినమునకు నాలుగయిదుమారులు పుచ్చు కొనవలయును. గొరింతదగ్గునకు, మ్యాగ్నెసియా ఫాస్ తోడ కాలీమూరు ౬ వ. చూర్ణమును పర్యాయక్రమముగ రెండుమూడుగంటల కొక మారు సేవించవలయును.

సాయంత్రపువేళలయందు గాని, గాలిరాని గృహామందు గాని, దగ్గు వృద్ధియగుచుండిన యెడలను, దగ్గుతోడ శ్లేష్మముపడుచుండినను, కాలీసల్ఫు ౬ వ. చూర్ణమును దినమునకు, మూడునాలుగుమారులు దినవలయును.

దగ్గుతోడ వట్టిసీళ్లవంటి శ్లేష్మము పడు చుండినయెడల నెట్రంమ్యూరును సేవించిన నయ మగును.

కళ్లె గట్టిగ పడుచుండినయెడల కాలీమూరు ౬ వ. చూర్ణమును బుచ్చుకొనవలయును.

జలుబుచేసివచ్చు దగ్గుతోడ సాధారణముగ జ్వరము గూడ నుండును. దానికి ఫెరంఫాస్

౾ మ. చూర్ణమును, నెట్రంమ్యూర్యారు ౾ మ. చూర్ణమును, పర్యాయక్రమముగ సేవించవలయును. ఇందువలన విరేచనమగును. జలుబు తగ్గి జ్వరము పోవును.

జలుబుచేసి వచ్చు దగ్గునకును, వేడినీటిని, వేడివేడిపాలను త్రావుచుండవలయును. శరీరమునకు చలిగాలి తగులగూడదు.

ఫ్లానలు చొక్కాను దొడుగుకొని యుండవలయును. ఆకలినిబట్టి యాహారమును బుచ్చుకొనుచుండవలయును.

తఱుచుగా జలుబుచేసి దగ్గుచుండిన యెడల నెట్రంమ్యూర్యారు, క్యాలికేరియాఫాస్‌ను పర్యాయక్రమముగ కొన్ని దినములు పుచ్చుకొనవలయును.

ఈ రోగులు దగ్గు నయమైన పిమ్మట చలినీళ్ల స్నానము చేయు చుండవలయును. చలిగాలియందు దిఱుగుటకు బ్రయత్నింపవలయును.

దగ్గు వచ్చినప్పుడు రొమ్మునకును, గొంతునకును, ఫ్లానలుగుడ్డను చుట్టుకొనవలయును. ఫ్లానలు చొక్కాను దొడుగుకొన వలయును. ఆమ్లపదార్థములను భుజింపరాదు. వేడిగనుండు భోజనపదార్థములను బుచ్చుకొనుచుండ వలయును.

## (౮౨) దుగ్ధజ్వరము

ప్రసవమైన రెండు మూడు దినములలో స్తనములయందు దుగ్ధములు ప్రవహించును. అప్పుడు కొద్దిగ జ్వరము వచ్చును. స్తనములు వాచును. తీపుగ నుండును. కాని దీనికి మందు వాడ నక్కఱలేదు. దానియంతట అదియే నయమగును.

చికిత్స :—ఫెరంఫాస్ ౬ మ. చూర్ణమును రెండు మూడు గంటల కొకమారు తీయవలయును.

## దుర్బలత్వము

నానావిధము లగు కఠిన రోగములు వచ్చి నయమైన పిమ్మటను, తగినంత యాహారము లభించ కుండుట వలనను, మిక్కుటమగు శారీరక మానసిక పరిశ్రమ వలనను, స్నాయువులు దుర్బలత నొందును. అందువలన దుర్బలత్వ మేర్పడుచున్నది.

చికిత్స :—ఏదయిన వ్యాధి వచ్చి నయమైన పిమ్మట గలుగు దుర్బలత్వమునకు, క్యాలికేరియా ఫాస్ ౬ మ. చూర్ణమును రోజునకు రెండు మూడు మోతాదులు పుచ్చుకొనవలయును.

మిక్కిలి శరీర పరిశ్రమవలన గలుగు దుర్బలత్వమునకు, ఫెరంఫాస్ ౬ మ. చూర్ణమును దినమునకు రెండు మూడు మాత్రలు పుచ్చుకొనవలయును.

మానసిక, స్నాయవిక దుర్బలత్వమునకు, కాలీఫాస్ ౬ మ. చూర్ణమును, రోజునకు రెండు

మోతాదులు దినవలయును. కొంతమంది క్యాలి కేరియాఫాస్‌ను దినుటవలన మిక్కిలి గుణము గనబడును.

బాగుగ నుడికిన పదార్థములను, త్వరిత ముగ జీర్ణమగు పదార్థములను మాత్రమే తినుచుండవలయును. విశుద్ధమగు వాయువునందు దిరుగుచుండవలయును. శీతలజలస్నాన ముత్తమము. శరీరస్థితిని బట్టి వ్యాయామ మొనర్చుచుండవలయును. పాలును, పెరుగును ద్రాగుచుండవలెను.

(౮3) దెబ్బలు - గాయములు

క్రింద పడినను, లేక, యేదయిన దెబ్బ తగిలినను, అచ్చట నెత్తురు గూడుకొని మిక్కిలి తీపుగా నుండును. దెబ్బ తగిలినచోట చర్మము పగిలి గాయమగును. కోసికొనిపోవును.

చికిత్స:—ఫెరంఫాస్ 3 మ. చూర్ణము ౨౦ గ్రెయినులను, మూడు నాలుగు తులముల

వేడినీళ్లయందు గలిపి, ఆ నీటితోడ గాయమును, దూదితో గాని, మురికిలేని తెల్లనిగుడ్డతో గాని కడుగవలయును. అందువలన రక్తము గారుట ఆగిపోవును. తీపు తగ్గును.

రక్తము మిక్కిలి కారుచుండిన యెడల ఫెరంఫాస్ 3 మ. చూర్ణమును గాని, ౬ మ. చూర్ణమును గాని, రెండుగంటల కొకమారు పుచ్చుకొనవలయును.

దెబ్బ తగిలినచోట మంచుగడ్డను గట్టుట వలన మేలు గలుగును.

దెబ్బ తగిలినచోట పుండయి చీము పట్టిన యెడల కాలీమూరు, క్యాలికేరియా సల్ఫుల నీయవలయును. "పుండు" అని వ్రాసినచోట జూడవలయును.

(౪౪) నరములు లాగుకొనిపోవుట

ఇది నరముల సంబంధమగు వ్యాధి. పలు కారణములవలన శరీరమందలి నరములు వికృతి

నొంది శరీరము, ధనురాకారముగ వంగిపోవును. కొందఱకు ప్రసవసమయమునను, ప్రసవానంతరమును, నీవ్యాధి గలుగుచుండును. శిశువులకు బొడ్డుకోసిన పిమ్మట నది పుండై దాని యుత్తేజనమువలన గూడ నీవ్యాధి గలుగుచుండును.

చికిత్స :—ఈ వ్యాధికి ప్రధానౌషధము మ్యాగ్నిసియాఫాస్. కావున నామందు ౬ మ. చూర్ణమును, నరగంట కొకమాఱు వేడినీళ్ల యందు గలిపి యీయవలయును.

రోగి మందును మ్రింగనియెడల తేనెతో గలిపి నాలుకమీద రాయవలయును. దీనితో పర్యాయక్రమముగ క్యాలికేరియాఫాస్‌నుగూడ గొందఱ కీయవలసి వచ్చును.

ప్రసూతికి వ్యాధిగలిగినయెడల కాలీమూరు ౬ మ. చూర్ణమును నరగంట కొకమా ఱీయవలయును.

కడుపునందు పురుగు లుండుటవలన స్నీవ్యాధి గలిగినయెడల నెట్రంఫాస్ 3 మ. చూర్ణమును వాడవలయును.

ఎవరికైనను, ఏకారణమువలన నీవ్యాధి వచ్చి నను, నరములు లాగుకొని పోవునప్పుడు మ్యా గ్నెసియాఫాస్‌ను మాత్రమే వాడవలయును. అది తఱిగిన పిమ్మట, నెట్రంఫాస్ క్యాలికేరియా ఫాస్, కాలీమూర్, ఫెరంఫాస్, మొదలగు వానిని వాడవలయును.

నరములు లాగుకొనిపోవునప్పుడు, ఆవిరి పట్టవలయును. ఈరోగికి జలుబు చేయకుండు నటులు జాగ్రత్తపడుచుండవలయును.

## (౭౫) నడుమునొప్పి

నడుమునొప్పి గల రోగి, నిలుచుండుటకును, కూర్చుండుటకును, కదలుటకును, మిక్కిలి కష్ట పడును. కొందఱకు నడుము వంగిపోవును. అందు

వలన వారు కఱ్ఱపుచ్చుకొని నడువవలసిన వార లగుదురు. కొంద ఱీ రోగమువలన కదల మెదల జాలక శయనించి యుండవలసినవార లగుదురు. ఈవ్యాధితోడ సాధారణముగ మలబద్ధకమును, సకృత్తుగా జ్వరముగూడ నుండును.

సాధారణముగ స్త్రీజననేంద్రియము స్థాన భ్రష్టమై క్రిందికి దిగ పొడుచుకొని వచ్చునప్పుడును, మలబద్ధకము, మూలశంక, మూత్రయంత్ర మందలి రోగములతోడ నడుము బిగించుకొని పోవుచుండును.

చికిత్స:—ఉష్ణమువలన నడుము బిగించుకొని పోయినయెడల ఫెరంఫాస్ ౬ వ. చూర్ణమును రెండుగంటల కొకమాఱు పుచ్చుకొన వలయును.

వాతమువలన బుట్టిన యెడల నెట్రంఫాస్ ౬ వ. చూర్ణమును రెండుగంటల కొకమాఱు సేవించవలయును.

నడుమునందు పోటు, మూత్రమును విడుచు నప్పుడు బాధ, మూత్ర మామ్లగంధయుతముగ నుండినయెడల నెట్రంఫాస్‌ను, ఫెరంఫాస్‌ను, గలిపి పుచ్చుకొనవలయును.

ప్రథమమున లేచుటకు గూర్చుండుటకు మిక్కిలి కష్టముగనుండి, లేచిన పిమ్మట వేదన హ్రాస్వమైనయెడల కాలీఫాస్ ౬ వ. చూర్ణమును రెండుగంటల కొకమాఱు పుచ్చుకొనవలయును.

నడుము వంచి పనిచేయుటవలన నీ వ్యాధి గలిగినయెడల, బల్లమీద గాని, కఠినశయ్యమీద గాని పరుండిన గొంచెము తగ్గును. ఆ వ్యాధికి నెట్రంమ్యూరు ౧౨ వ. చూర్ణమును రెండుగంటల కొకమాఱు తీయవలయును.

నడుమునందు పోట్లుండి, విరేచన బద్ధకము గూడ నుండిన యెడల క్యాల్కేరియాఫ్లవరు ౧౨ వ. చూర్ణమును రెండుగంటల

శోకమూలు పుచ్చుకొనవలయును. క్యాలికేరి యాఫాస్ వలనగూడ నిది నయమగును.

ఫెరంఫాస్ లేక, నెట్రంఫాస్, మలామును నడుమునకు బట్టించవలయును. నడుమునకు ఫ్లానలు గుడ్డను జుట్టవలయును. కాపుగాని, ఆవిరిగాని పట్టవలయును. ఝూడించి విరేచన మగు పదార్థములను మాత్రమే దినుచుండ వలయును.

(౪౬) నులిపురుగులు

తఱుచుగ చిన్నపిల్లల కీ వ్యాధి సంభవించుచుండును. కాని వయసు ముదిరినవారి కడుపున గూడ నులిపురుగులు పుట్టుచుండును. తీపివస్తువులను దినుటవలన వ్యాధి గలుగును. దీనివలన పిల్లలకు మిక్కిలిగ ఆకలియుండును. లేక యాకలి మందగించును. పెద్దపురుగు లుండినయెడల కక్కులు, కడుపునొప్పి, పీకుడు మొదలగునవి యుండును.

చికిత్స:—నెట్రంఫాస్ 3 మ. చూర్ణమును దినమునకు ముమ్మాఱు సేవించవలయును. ఇందు వలన చిన్న పురుగులు, పెద్దపురుగులు గూడ నశించును.

చిన్న పురుగులకు నెట్రంఫాస్‌తోడ, నెట్రం మ్యూరును గూడ పర్యాయక్రమముగ వాడ వలయును.

కాలీమూరు ౬ మ. చూర్ణమును, రోజునకు ముమ్మాఱు సేవించినయెడల చిన్న పురుగులు నశించును. దీనిని నెట్రంఫాస్ తోడ పర్యాయ క్రమముగ నిచ్చుట మంచిది.

మిక్కిలి యజీర్ణ పదార్థములను, అజీర్ణ ద్రవ్య ములను భుజింపరాదు.

(౪౭) 'నిమోనియా'

శ్వాసకోశమందు చిన్న చిన్న కోశము లుబ్బుటవలన, నం దుండు రసము గట్టిపడును.

అందువలన కోశము లన్నియు మూసికొనిపో వును. ఇందువలన నిశ్వాసప్రశ్వాసలు విడు చుట మిక్కిలి కష్టమగును. రొమ్ముల యందు మిక్కిలి బాధ యుండును. జ్వరము ప్రబలముగ నుండును. మిక్కుటముగ దగ్గు, దానితోడ శ్లేష్మము పడుచుండును. ఒక శ్వాసకోశమం దిది గలిగిన యెడల 'సింగిలు నిమోనియా' యనియు, శ్వాసకోశముల రెంటియందును గలి గిన యెడల 'డబ్బిలు నిమోనియా' యని యును జెప్పుదురు. డబ్బిలు నిమోనియా కఠిన జాడ్యము. కావున సమర్థులగు డాక్టరులకడ వైద్యము చేయించుకొన వలయును. సింగిలు నిమోనియా గూడ కఠినవ్యాధియే యైనను, నయమగును.

చికిత్స:—ఫెరంఫాస్ 3 మ. చూర్ణమును, గంటకు, రెండుగంటల కొకమా ఱీయవల యును. ప్రథమావస్థయం దీ చూర్ణము వలన

నయమగును. చలిగాలి తగులుటవలన నీ వ్యాధి సంభవించినయెడల, ఫెరంఫాస్‌ను దినుటవలన, శరీరమంతయు చెమటలు పట్టును. అందువలన త్వరలో నయమగును.

ఫెరంఫాస్‌ను దినుటవలన చెమటలు పట్టని యెడల, దానితోఁడ పర్యాయక్రమముగ కాలీ సల్ఫు ౬ మ. చూర్ణమును వాడవలయును.

ప్రథమావస్థ దాటి దగ్గుతోఁడ గట్టిగ శ్లేష్మము పడుచుండినయెడల కాలీమూరు ౬ మ. చూర్ణమును, ఫెరంఫాస్‌తోఁడ పర్యాయక్రమముగ రెండుగంటల కొకమా ఈయవలయును. మఱియు, కాలీమూరు ౩ మ. చూర్ణమును ౩౦ గ్రెయిను లోకయవున్ను వాసలయినునందు గలిపి దానిని ఎదురురొమ్మునకు పూయవలయును. రొమ్మునకు ఫ్లానలుగుడ్డను జుట్టవలయును.

కళ్లె సులభముగ వచ్చుచుండిన యెడల రోగము తిరుగుముఖమునకు వచ్చినదని గ్రహింపవలయును. క్రమముగా కళ్లెయాగి పొడిదగ్గుగ మాఱును. అప్పుడు కాలీసల్ఫ్యును మాత్ర మీయవలయును.

శరీరమునకు బలము వచ్చుటకుగాను, ఉదయమునను, సాయంత్ర మందునను, క్యాలికేరియాఫాస్ ౬ వ. చూర్ణమును రెండు మోతాదు లీయవలయును.

ఈ రోగికి చలిగాలి తగులగూడదు. చలిగాలి తగిలినయెడల రోగ మపాయకర మగు స్థితికి వచ్చును. అతి సులభముగ జీర్ణ మగు పదార్థములను మాత్రమే దినుట కీయవలయును. వేడిపాలు, బార్లీజావ మొదలగువాని నిచ్చుట యుత్తమము. రోగి శయనించు గది లోని కే విధమగు పొగగాని, దుర్గంధము గాని రాగూడదు. గదిలోనికి పరిశుభ్రమగు వాయువు

మాత్రము వచ్చుచుండవలయును. రోగి కణము మాత్ర మైనను శీతగాలి తగులగూడదు. గృహ మందలి వేడిమిని సమముగ నుంచుటకు బ్రయ త్నించవలయును.

## (౪౮) నీళ్లవిరేచనములు

నీళ్లవిరేచనములు రోజునకు పది పదునైదు మాఱులుగూడ నగుచుండును. మలముతోడ శ్లేష్మము పడుచుండును. కొందఱకు అజీర్ణ భుక్త ద్రవ్యములు గూడ విరేచనము నందు గనబడుచుండును. విరేచనముల తో బాటు సాధారణముగ నల్పాచమాన మగుచుండును. కాని కొంతమందికి అల్పాచమానము గాదు. కడుపులో గుడగుడ లాడు చుండును. కడుపు నొప్పి, పీకుడు నుండును. కొందఱ కధిక పరి మాణముగ నొకటి రెండు విరేచనములును, మఱికొందఱకు ౧౫-౨౦ విరేచనములు గూడ నగుచుండును.

ఆహారపదార్థములయందలి దోషమువలనను అజీర్ణము గలిగించు పదార్థములను మిక్కుటముగ దినుటవలనను, హఠాత్తుగ జలుబుచేయుట వలనను, నీళ్లవిరేచనములు పుట్టును. మఱియు పిల్లలకు పండ్లు వచ్చునప్పుడు నీళ్లవిరేచనము లగుచుండును.

చికిత్స:—అజీర్ణమును గలిగించు పదార్థములు దినుటవలన విరేచనము లగుచుండిన యెడల క్యాలికేరియాఫాస్ 3 మ. చూర్ణమును రెండుగంటల కొకమా ఱీయవలయును.

పొట్టనొత్తిన నొప్పిగా నుండినను, అజీర్ణ భుక్తద్రవ్యములు మలముతో బడుచుండినను, క్యాలికేరియాఫాస్తోడ, ఫెరంఫాస్ ౬ మ. చూర్ణమును గలిపి యీయవలయును.

మలము ఆమ్లగంధయుక్తముగ నుండినయెడల నెట్రంఫాస్ 3 మ. చూర్ణము నీయవలయును.

పైత్యాధిక్యతవలన విరేచనము లగుచుండి నను, మలము పచ్చగ నుండినను, నెట్రంసల్ఫ 3 మ. చూర్ణమును రెండుగంటల కొకమాటు తీయవలయును.

నాలుక, మలము, తెలుపుగ నుండినయెడల, కాలీమూరు ౬ మ. చూర్ణమును రెండుగంటల కొకతూరి యీయవలయును.

మలము పసుపుపచ్చగ నుండినయెడల కాలీసల్ఫు ౬ మ. వాడవలయును.

పథ్యము:—పాతబియ్యపు అన్నమును గంజి, మజ్జిగను ద్రావవచ్చును. అజీర్ణము పుట్టించు నట్టిగాని, యుద్రేకమును గలిగించునట్టిగాని పదార్థములను దినగూడదు. ఫ్లానలు చొక్కాను దొడుగుకొని యుండవలయును.

(౪౯) నీటిబుడ్డ

పురుషుల అండములయందు నీరు ప్రవేశించినయెడల దానిని నీటిబుడ్డ యని పిలిచెదరు.

ఇది కొంతమందికి పుట్టుకతోడనే యుండును. మఱికొందఱి కిది యౌవనకాలమందు సంభవించును. కొందఱి కొకయండమందునను, మఱికొందఱకు రెండు అండములయందును నీరు చేరును.

ఎప్పుడు నిలుచుండి యుండువారల కిది యెక్కువగుచుండును. ప్రస్రావవేగము నాపుకొనుట వలనను, పలువిధము లగు కుచింతల వలనను, శరీరదుర్బలత్వమువలనను నీ వ్యాధి గలుగుచున్నది. కొందరి కిది యమావాస్య పూర్ణిమలయందు వృద్ధియగుచుండును.

చికిత్స:—ఈ వ్యాధియొక్క ప్రారంభ దశయందు నెత్రంముర్యారు ౧౨ వ. చూర్ణమును దినమునకు మూడు నాలుగు మాఱులు పుచ్చుకొనవలయును.

నెత్రంసల్ఫు ౬ వ. చూర్ణమును దినుట వలన కొంతమందికి నయమగును.

అమావాస్య పూర్ణిమలయందిది వృద్ధియగు చుండినయెడల సాయిలీసియా 30 మ. చూర్ణ మును రోజునకు మూడు నాలుగు మాఱులు పుచ్చుకొనవలయును.

ఈ వ్యాధి పురాతనరూపమును దాల్చిన యెడల క్యాలికేరియాఫాస్ 30 మ. చూర్ణ మును నెట్రంమ్యూర్ 30 మ. చూర్ణమును, పర్యాయక్రమముగ దినమునకు రెండు మూడు మాఱులు పుచ్చుకొనవలయును.

ఈ రోగి చాలసేపు నిలుచుండగూడదు. మలమూత్రవేగమును ధారణ జేయగూడదు.

## (౫౦) నోటిపూత

నాలుకమీదను, నోటినిండను సన్న నిప్పుండ్లు పడును. నోటివెంట తెల్లనినీరు గాఱును. లవణ యుక్త మగు పదార్థములను భుజించినయెడల మంట పుట్టును. సాధారణముగ చిన్నపిల్లల

కీవ్యాధి గనబడు చుండును. పెద్దలకు గూడ వచ్చును. జలుబుచేయుటవలనను, దుర్బలత్వము వలనను, విరోచనబద్ధకమువలనను నిది సంభవించును.

చికిత్స:—కాలీమూరు ౬ మ. చూర్ణమును, రోజునకు నాలుగు మోతాదులు పుచ్చుకొనవలయును.

మిక్కిలిగ నోటివెంట నీరు గాఱుచుండినను, విరేచనబద్ధక ముండినను నెట్రంమ్యూర్యారు ౬ మ. చూర్ణమును, దినమునకు, నాలుగయిదుమాఱు లీయవలయును.

తేనెయందు గలిపి పై మందులను, నాలుక మీదను, నోటియందునను రాయవలయును.

శీత కాలమందునను, చలిగాలి తగులుట వలనను, బాలకులకు, యౌవనవంతులకును, ముఖ్యముగ గర్భిణీస్త్రీల కిది సంభవించు చుండును. అప్పుడు నెట్రంమ్యూర్యారు ౩౦ మ. లేక

యంతకు మించిన సంఖ్యమందును, దినమునకు రెండుమూడుమాఱు లీయవలయును.

వేడిపాలను త్రావుచుండ వలయును. గోరు వెచ్చని నీటియందు కాలిమూరును గలిపి యా నీటితోడ పిల్లల నోటిని గడుగవలయును. ఝూడించి విరేచన మగునటులు చూడవలయును. ఎప్పుడును వస్త్రమును గప్పుకొని యుండవలయును.

## (౫౧) నంజువ్యాధి

శరీరమందు పెక్కుచోట్ల నంజు గనబడుచుండును. తలయందు నీరుచేరును. శ్వాసయంత్రములయందు, హృత్పిండమందు, అండముల యందు జలము చేరిన దానిని నీటిబుడ్డ యని చెప్పుదురు.

శరీరమం దంతటను నీరు గనబడిన, దానిని నంజు అని చెప్పుదురు.

చికిత్స :—తలయందు జలము చేరినయెడల క్యాలికేరియాఫ్యాసును నీయవలయును.

శ్వాసకోశములయందు జలము చేరినయెడల నెట్రంమ్యూర్యారును వాడవలయును.

జీర్ణకోశమందు జలము చేరినయెడల కాలీమూరు, నెట్రమ్యూర్యారును, నీయవలయును.

అండములయందు జలముచేరినయెడల క్యాలికేరియాఫాస్, నెట్రంమ్యూర్యారు, నెట్రంసల్ఫు, సయిలీసియా యను వానిని వాడవలయును.

శరీరమందంతటను, జలము గూడినయెడల నెట్రంసల్ఫు, కాలీమూరు, నెట్రంమ్యూర్యారు, క్యాలికేరియాఫాసుసు వాడవలయును.

మలేరియాజ్వరమువలన, కుడివైపు డొక్కయందుండు, కార్జము సన్నగిలుటవలన గాని, యుబ్బుటవలనగాని, యుదరమందు నీరుచేరును. దీనిని ఇంగ్లీషునందు డ్రాప్సీయని చెప్పుదురు. దీనికి కాలీమూరు, నెట్రంసల్ఫులను వాడవలయును.

మలేరియా జ్వరమునకు మిక్కుటముగ క్వయినాను దినుటవలన కొంతమందికి రక్తము చెడిపోవును. అప్పుడు కాళ్లుచేతుల యందు నంజు కనబడును. దానికి క్యాలికేరియాఫాస్ 3 మ. చూర్ణమును. నెట్రంమ్యూర్ 30 మ. చూర్ణమును వాడవలయును.

ఈ వ్యాధి గలిగినవారికి జలుబు చేయకుండు నటులు చూచుచుండవలయును.

మఱియు శరీరమునకు బాగుగ చెమట పట్టు నటులును మూత్రము మిక్కుటముగ నగుటకును బ్రయత్నింపవలయును. వేడిని గలిగించు వస్త్రములను గప్పుకొనుచుండవలయును. అతి సులభముగ జీర్ణించు నాహారపదార్థములను భుజింపవలయును. పాలుద్రాగుటమంచిది. పండ్లను దినుచుండవచ్చును. గాలిరానిగదియందు వేడినీళ్లలో గుడ్డను ముంచి దానితోడ శరీరమును దుడుచు

కొన వచ్చును. అందువలన చెమటపట్టును. చలిగాలి తగులగూడదు.

(౫౨) పక్షవాతము

పక్షవాతము కాళ్లకు వచ్చిన కాళ్లు పడిపోవును. అందువలన నడువజాలరు. చేతులకు వచ్చిన చేతులు పడిపోవును. మోమునకు వచ్చిన మోము వంకరపోవును. నాలుకకు వచ్చిన మాటలాడజాలదు. ఇటులే యవి శరీరమందనేకస్థానములయందు వచ్చుచుండును. ఎచ్చట వచ్చినను చికిత్స మాత్ర మొకేవిధముగ జేయవలయును.

చికిత్స :—కాలిఫాస్, అను చూర్ణముమాత్రమే దీనికి ప్రధానౌషధము. కావున దీనిని ౭ మ. చూర్ణమును రెండుగంటల కొకమాఱు పుచ్చుకొనవలయును. కాలిఫాస్ 3 మ. చూర్ణమును వాసలయినుతో గలిపి పక్షవాత మాక్రమించిన ప్రదేశమందు తోమవలయును.

కొంతమందికి దీనితోడ మ్యాగ్నెసియా ఫాస్‌నుగూడ నీయవలసిన యవసర ముండును. శరీరబలమునకుగాను క్యాలికేరియాఫాస్ ౬ వ. చూర్ణమును రోజునకు రెండు మూడు మాఱు లీయవలయును.

త్రాగుబో తగుటవలన గాని, సుఖజాడ్యములవలన గాని పక్షవాతము గలిగిన యెడల కాలీమ్యూరు ౬ వ. చూర్ణమును గూడ వాడవలయును.

## (౫౩) పడిసెము

చలిగాలియందు దిరుగుటవలన గాని, వర్షమందు దడియుటవలన గాని, జలుబు చేయుటవలన గాని, పడిసెము పట్టుచుండును.

చికిత్స:—ముక్కువెంట నీరు గాఱుచుండిన యెడల నెట్రంమ్యూరు ౬ వ. చూర్ణమును రెండుగంటల కొకమాఱు ఱీయవలయును.

జ్వరము వచ్చునటు లుండిన యెడల ఫెరం ఫాస్ ౬ వ. చూర్ణమును, రెండుగంటల కొకమా ఱీయవలయును.

ముద్దలు ముద్దలుగ శ్లేష్మము మిక్కిలి పడుచుండిన యెడల, కాలీమూరు ౬ వ. చూర్ణమును మూడుగంటల కొకమా ఱీయవలయును.

వేడినీళ్లయందు కాళ్లను బెట్టి యుంచవలయును. పచ్చళిము, బూర్నిసు మొదలగువానిని గప్పుకొని శరీరమునకు చెమట పట్టునట్లొనర్పవలయును. వేడిపాలను ద్రాగవలయును.

(౫౮) వలుగురువు

చిగుళ్లయందు గురుపులు లేచును. ఆ కురుపులకు చీము పట్టును. తీపు, పోటు ఉండును.

చికిత్స:—ఫెరంఫాస్ ౬ వ. చూర్ణమును రెండుగంటల కొకమాఱు పుచ్చుకొనవలయును.

ఫెరంఫాస్ 3 వ. చూర్ణమును కురుపుమీద రాయవలయును.

కురుపు వాచినయెడల కాలీమూరును బుచ్చుకొనవలయును. దానినే కురుపుమీద బట్టించవలయును.

చీము పట్టినయెడల క్యాలికేరియాసల్ఫు 30 వ. చూర్ణమును బుచ్చుకొనినయెడల త్వరలో నయమగును.

చీము గారుచుండినయెడల సయిలీసియాను దినవలయును.

(౧౧) పిల్లలు శుష్కించుట

సాధారణముగ పిల్లలు శుష్కించి పోవుచుందురు. ఇది కొంతమంది యౌవనులకును పెద్దలకుగూడ వచ్చుచుండును. ఈ వ్యాధివలన నరములు శుష్కించి పోవును. మిక్కిలి దుర్బలత్వమేర్పడును. శిశువులకు స్తన్యాభావమువల

నను, ఆమ్లము వలనను, నీవ్యాధి గలుగుచున్నది. శరీరపరిమాణమునకు గావలసినంత ఆహారము లభింపకుండుటవలన శరీరము శుష్కించును. చర్మము గట్టిపడును. విరేచనము గట్టిగనగును.

చికిత్స:—దీనికి ప్రధానౌషధము కాలీఫాస్ కావున ౬ మ. చూర్ణమును దినమునకు మూడు నాలుగుమాఱు తీయవలయును.

శిశువులెప్పుడును కండ్లు మూసికొని యుండినను, దంతములు వచ్చుట ఆలస్యమైనను, క్యాల్కేరియాఫాస్ 3 మ. లేక, ౬ మ. చూర్ణమును వాడవలయును.

ఆమ్లజనితవ్యాధికి నెట్రంఫాస్ 3 మ. చూర్ణమునుగాని యంతకుమించిన సంఖ్యలను గాని వాడవలయును.

శరీరము త్వరితముగ శుష్కించుచుండినను, పొట్ట లావయి చేతులు కాళ్లు సన్నగిలుచుండిన యెడలను, విరేచనము కఠినముగ నగుచుండి

నను, నెట్రంమ్యూర్యాకు ౬ వ. చూర్ణమును రోజునకు రెండు మూడుమాఱు లీయవలయును.

సిలీసియాను, ఫెరంఫాస్‌ను, అప్పు డప్పు డిచ్చుచుండుట మంచిది.

పథ్యము:—ఈరోగిని తరుచుగ స్నానము జేయించు చుండవలయును. ఆమ్లవృద్ధి యగు పదార్థములను దినరాదు. భోజనానంతరము క్యాలికేరియా ఫాస్‌ను బుచ్చుకొన వలయును. సులభముగ జీర్ణమగు వానిని మాత్రమే దిన వలయును.

## (౫౬) పిల్లలకు తలయందు గురుపులు

పిల్లలకు తలనిండ కురుపులు లేచును. ఆ కురుపులయందు చీము గూడ నుండును.

చికిత్స:—క్యాలికేరియాసల్ఫు ౬ వ. చూర్ణమును దినమునకు రెండుమాఱు లీయ వల యును.

చీము దుర్గంధయుతమై యుండిన యెడల, సాయిలీసియా ౩౦ మ. చూర్ణమును దినమునకు రెండుమాఱు లీయవలయును. తలను శుభ్రముగ నుంచవలయును. వాసలయినును గాని, నేతిని గాని రాయవలయును.

(౫౭) పండ్లతీపు

చలిగాలి తగులుటవలనను, పలు చిగుళ్ల యందు రక్త మెక్కుడుగ జేరుటవలనను, మరి యితర కారణములవలనను, పలుచిగుళ్లు మిక్కిలి తీపుగను పోటుగను నుండును.

చికిత్స:— చలిగాలి తగులుటవలన గాని, రక్తాధిక్యమువలన గాని, తీపు గలిగినయెడల ఫెరంఫాస్ ౬ మ. చూర్ణమును రెండుగంటల కొకమాఱు పుచ్చుకొనవలయును. కొందఱకు సయిలీసియా ౬ లేక ౧౨ మ. చూర్ణమునుగూడ పర్యాయక్రమముగ వాడవలసియుండును.

దెబ్బ తగులుటవలన తీపు గలిగినయెడల క్యాలికేరియాసల్ఫు, సయిలీసియాలను నీయ వలయును.

స్నాయుసంబంధమగు వేదన యయినయెడల మ్యాగ్నిసియాఫాస్, ౬ వ. చూర్ణమును వేడి నీటితోడ నీయవలయును. ఆవిరి పట్టవలయును. దవుడల కంటియుండునటుల ఫ్లానలు గుడ్డను జుట్టుకొనవలయును.

## (౫౮) పాండురోగము

రక్తము తరిగిపోయినయెడల, దానిని పాండు రోగమని చెప్పుదురు. సాధారణముగ యౌవన స్త్రీలకీవ్యాధి గనిపించు చుండును. పరిశ్రమ యనుమాట నెఱుంగక సోమరులై సూర్యరశ్మి లోనికి బోనివారి కీవ్యాధి గనిపించుచుండును. మిక్కిలి జబ్బుపడి లేచినపిమ్మటను, అజీర్ణము ఆమ్లము, మొదలగు వానివలన నిది పుట్టు చున్నది.

చికిత్స:—ఈవ్యాధికి ముఖ్యౌషధము క్యాలికేరియాఫాస్. కావున నీ చూర్ణమును, 3 మ. లేక, ౬ మ. లను దినమునకు మూడునాలుగు మాఱులు పుచ్చుకొనవలయును.

రక్తమందు జలసంబంధమగు పదార్థము వృద్ధియైనను, లేక మలేరియా జ్వరమువలన రక్తము క్షీణించినను, నెట్రంసల్ఫ ౬ మ. చూర్ణమును బుచ్చుకొనవలయును.

క్వయినాను దినుటవలనను, లేక మఱి యే యితరకారణములవలన నైనను రక్తము దరిగిన నెట్రంమ్యూర్ ౧౨ మ. లేక 30 మ. చూర్ణమును సేవింపవలయును.

యౌవనస్త్రీలకు నెట్రంమ్యూర్ నిచ్చుటయే యుత్తమము. కావున, నెట్రంమ్యూర్ క్యాలికేరియాఫాస్ 30 మ. చూర్ణమును పర్యాయక్రమముగ దినవలయును.

శరీరమునం దెచ్చటనుండియైనను రక్తము గాఱుటవలన రక్తము దరిగినయెడల ఫెరంఫాస్ ౬ మ. చూర్ణమును బుచ్చుకొనవలయును.

అజీర్ణము మొదలగువానివలన రక్తముక్షీణిం చినయెడల, నెట్రంఫాస్, క్యాలికేరియాంఫాస్ 3 లేక, ౬ మ. చూర్ణములను పర్యాయక్రమ ముగ బుచ్చుకొనవలయును.

బాగుగనుడికినట్టియు, సులభముగ జీర్ణమగు నట్టియు పదార్థములనుమాత్రమే దినవలయును. మంచిగాలియందు దిరుగుచుండవలయును. శరీర స్థితినిబట్టి వ్యాయామ మొనర్పవలయును. శీతల జలస్నానము మంచిది. వాయుపరివర్తనం బొన ర్చుచుండుట మంచిది. వీలయినంతవఱకు శరీర మును వంచి పనిచేయుచుండవలయును. మనో దుఃఖ ముండరాదు. పాలు, పండ్లు, అన్నము మొదలగువానిని దినవచ్చును.

## (౫౭) పిల్లలకు వచ్చు దగ్గు

దీనిని ఇంగ్లీషునందు (క్రూప్)అని చెప్పుదురు. బాలకుల కీదగ్గు వచ్చును. ఆఱువత్సరముల వయసు మీఱినవారికి దగ్గురాదు. చలిదేశముల యందు మాత్రమే యీవ్యాధి వచ్చుచుండును. ప్రకృతమని, అప్రకృతమని యీదగ్గు రెండు విధములు.

(౧) ప్రకృతపుదగ్గు మిక్కిలి కఠినమైనది. కావున డాక్టరుల సహాయము బొందవలయును.

(౨) అప్రకృతపు దగ్గు సహజముగ నయమగును. కావున గృహస్థులు గ్రంథసహాయ్యముసఁ వైద్యము చేయవచ్చును. ఈదగ్గు పుట్టుటకు కారణ మేదయిననను, జలుబు చేయుట వలనను, చలిగాలి తగులుటవలనను, సిది వృద్ధి యగుచుండును. ప్రకృతపు దగ్గునకు జ్వరము మిక్కుటముగ నుండును. శ్వాస నాళ ము ల

యందు శ్లేష్మము చేరుటవలన శ్వాస విడుచుట మిక్కిలి కష్టమగును. హఠాత్తుగా రాత్రులం దీ దగ్గు పుట్టుచుండును.

అప్రకృతపుదగ్గు సామాన్యమగు జలుబువలన ప్రారంభమగును. కొందఱకు దీనితోడ నత్యల్పముగ జ్వరముగూడ నుండును. రొమ్ములు బరువుగ నుండును. శ్వాసవిడుచుట కష్టమగును.

చికిత్స:— ఫెరంఫాస్ ౧౨ మ. చూర్ణమును, రెండుమూడు గంటల కొకమా టీయవలయును. దీనితోడ క్యాలికేరియాఫాస్ ౧౨ మ. చూర్ణమును గూడ పర్యాయక్రమముగ వాడవలయును. ఇందువలన తగ్గనియెడల నెట్రంమ్యూర ౧౨ మ. చూర్ణమును గూడ పర్యాయక్రమముగ వాడవలయును. కొందరికి పై యౌషధములే గాక కాలీమూరును గూడ వాడవలయును.

ఇట్లు జాగ్రత్తగ నౌషధసేవ జేయుచుండిన యెడల దగ్గు నయమగును.

ఈరోగిని గృహమునుండి బైట కేగనియ్యజనదు. ఊలుచొక్కా తొడిగి యుంచవలయును. కాలీమూరు మలామును, వక్షఃస్థలమునకు బట్టించ వలయును. వేడివేడిపాలను ద్రాగనీయ వలయును. గంజిని, జావను ద్రాగవచ్చును. ఫలములు దినవచ్చును.

## (౬౦) పిల్లలకు పండ్లువచ్చుట

పండ్లు వచ్చునప్పుడు శిశువులకు పలురోగములు వచ్చును. పండ్లు వెలుపలకు వచ్చుట ఆలస్యమైనయెడల, అజీర్ణము, ఆమాశయము, అనిద్ర, జ్వరము మొదలగు రోగములు వచ్చుచుండును. ముఖము, తల, రొమ్ము, చేతులు, కాళ్లు, మొదలగు స్థలములయం దొక విధమగు నల్లనిగజ్జి పుట్టును.

చికిత్స:—పండ్లువచ్చుట ఆలస్యమైనయెడల క్యాలికేరియాఫాస్ 3 మ. చూర్ణమును పాలతో గలిపి దినమునకు రెండు మూడు మాఱు లీయవలయును. ఇందువలన పండ్లు త్వరితముగ వచ్చును.

అజీర్ణము మొదలగువాని కొఱకు క్యాలికేరియాఫాస్ 3 మ. చూర్ణమును, నెట్రంఫాస్ 3 మ. చూర్ణమును గలిపి రెండుమూడు గంటల కొకమా ఱీయవలయును.

జ్వర ముండినయెడల ఫెరంఫాస్ ౬ మ. చూర్ణమును, క్యాలికేరియాఫాస్ ౬ మ. చూర్ణమును, రెండుగంటల కొక మోతాదు నీయవలయును. చిన్నబిడ్డకు గుణము గనబడినయెడల చలినీళ్లతోడ తలను తడిపి, రొమ్ముమీద తడి గుడ్డను వేయవలయును. రెండుకాళ్లు వేడి నీళ్లయందు బెట్టి యుంచవలయును. మ్యాగ్నెసియాఫాస్ ౬ మ. చూర్ణమును, ఫెరంఫాస్

౬ మ. చూర్ణమును వేడినీళ్లతోడ పర్యాయ క్రమముగ పదినిమిషముల కొకమారు ఈయవలయును.

ఝూడించి విరేచన మగునటుల, చూచుచుండవలయును.

ఆమాశయ మున్న యెడల కాలీమూరు ౬ మ. చూర్ణము నీయవలయును.

చొంగ గార్చుచుండినయెడల నెట్రంమ్యూరు నీయవలయును.

నిద్దుర పోనియెడల క్యాలీఫాస్ నీయవలయును.

శిశువులకు తల్లిపా లుత్తమము. ౭,౮, మాసములకే పిల్లల కన్నము బెట్టుదురు. అట్లు అన్నము బెట్టుటవలన పండ్లు త్వరితముగ వచ్చును. ఏవిధమగు జబ్బును లేకుండిన యెడల చలినీటి స్నానము మంచిది. చొంగ కార్చుచుండిన

యెడల, లవణమిశ్రిత మగు పదార్థములను బెట్టు చుండ వలయును. మిగిలిన వ్యాధులకు ఆ యా జబ్బులకు చెప్పబడిన ప్రకారము చికిత్స చేయ వలయును.— శిశువులకు మోతాదు మందు గ్రెయినులో నాల్గవభాగ ముండవలయును. అంతకు మించగూడదు. తగ్గినను మంచిది.

## (౬౧) పిత్తాధిక్యము

పిత్తాధిక్యమువలన కాళ్లుచేతులు మోమును శరీరమంతయు మంటగనుండును. నోరుచేదుగ నుండును. మాటి మాటికి నుమ్మివేయ వలసి యుండును. తరుచు పిత్తవమన మగు చుండును.

చికిత్స:— నెట్రంసల్ఫు ౬ మ. చూర్ణమును దినమునకు మూడునాలుగు మాఱులు పుచ్చుకొనవలయును. పిత్తమును వృద్ధిచేయు వస్తువులను దినరాదు. పులుపుగ నుండు ఫలములు మొదలగువానిని దినవలయును.

## (౬౨) పిత్తశిల

పిత్తనాళముల యందు పిత్తము గడ్డకట్టిన యెడల దానిని పిత్తశిల యని చెప్పుదురు. ఇందు వలన నోరు చేదుగ నుండును. పిత్తవమన మగు చుండును. కార్జముకడ తీపు పోటు నుండును.

చికిత్స:—నెట్రంసల్ఫు ౬ మ. చూర్ణమును రెండుగంటల కొకమా ఱీయవలయును. బాధకు గాను నెట్రంసల్ఫుతోడ మ్యాగ్నిసియా ఫాస్ ౬ మ. చూర్ణమును వేడినీటితోడ రెండుగంటల కొకమా ఱీయవలయును. ఆవిరిపట్టవలయును.

పైత్యమును వృద్ధిచేయు పాలు, నేయి, మాంసము, చేపలు మొదలగువానిని దినరాదు. మజ్జిగ త్రాగవచ్చును. పండ్లు అన్నమును దినవచ్చును.

## (౬౩) పుండుపడుట

శరీరమం దెచ్చటనైన కాలిగాని, దెబ్బతగిలి గాని, లేక పొక్కులులేచి గాని పుండుపడి చీముపట్టును.

చికిత్స:—కొద్ది గాయమై చీము నీటివలె కాఱు చుండినయెడల, నైట్రంమ్యూర ౬ వ. చూర్ణమును రోజునకు రెండుమూడు మాఱు లీయవలయును.

కొంచెము పెద్దదైనచో కాలీమూరు నీయవలయును.

పుండు మిక్కిలి పెద్దదయినయెడల క్యాలికేరియాఫాస్ ౬ వ. చూర్ణమును రోజునకు రెండుమూడుమాఱు లీయవలయును.

క్యాలికేరియాసల్ఫు అన్నివిధములగు పుండ్లకును ముఖ్యమగు మందు. పుండునుండి రక్తమిశ్రితమగు చీము వచ్చుచుండిన దీనిని వాడిన త్వరలో నయమగును. సాయిలీసియాను గూడ వాడవలయును. చీము పసుపుపచ్చగ నుండిన, నైట్రంసల్ఫును వాడవలయును.

లోపలకు బుచ్చుకొను నౌషధమునే వాసలయినుతో గలిపి కురుపులకు బట్టింపవలయును.

తీపిపదార్థములు చేపలు మొదలగు వానిని దినరాదు.

## (౬౮) పేగులయందు వాయువు చేరుట

ఆమ్లమువలనను, అజీర్ణమువలనను, పేగులయందు వాయువు చేరును. ఇందువలన కడుపుబ్బును. పొట్టమీద గొట్టిన శూన్యశబ్దము వినబడును. జ్వరము మొదలగు పలువిధవ్యాధులతోడ నిది గన్పించుచుండును. కొంతమందికిది ప్రమాదజనక మగును.

చికిత్స :— క్యాలికేరియాఫాస్ ౬ మ. చూర్ణమును, గంట కొకమారు పుచ్చుకొనవలయును.

అజీర్ణము, తేనుపు లుండినయెడల, నెట్రం సల్ఫు 3 మ. చూర్ణమును క్యాలికేరియా ఫాసుతో గలిపిగాని, పర్యాయక్రమముగ గాని, నీయవలయును. కొందఱికుపై చూర్ణములతోడ

మ్యాగ్నేసియాఫాస్‌ను గూడ పర్యాయక్రమ ముగ నీయవలసి యుండును.

పథ్యము విషయమున జాగ్రత్తగ నుండ వలయును. తేలికయగు పదార్థములను, బాగుగ పక్వమైన పిమ్మట భుజింపవలయును. అజీర్ణ మును గలిగించు పదార్థములను ముట్టజనదు.

## (౬౫) పేగు బయటకు వచ్చుట

మలత్యాగకాలమందు కొందరికప్పుడప్పుడు గుహ్యద్వారమునుండి పేగు బయటికి వచ్చు చుండును. శరీరదౌర్బల్యమువలనను, ఆమాశ యము మొదలగు పురాతన జాడ్యములవలనను నీ వ్యాధి గలుగుచుండును.

చికిత్స:—వెలుపలకువచ్చిన పేగుకు వ్యాస లయనుగాని, నేతినిగాని రాచి, బొట్టనవ్రేలి తోడ నా పేగును లోనికి నెట్టవలయును.

కాలీఫాస్ ౬ వ. చూర్ణమును రోజునకు మూడు నాలుగు మోతాదు లీయవలయును. కొందఱకు క్యాలికేరియా ఫ్లవరును ౬ వ చూర్ణమును గూడ నీయవలసియుండును.

ఫెరంఫాస్ 3 వ. చూర్ణమును దినమునకు నాలుగుమాఱులు పుచ్చుకొనవలయును. ఇందు వలన గుహ్యద్వారమందలి మాంసము మొద లగునవి బలపడును. అందువలన పేగు వెలుప లకు రాదు.

క్యాలికేరియాఫ్లవరు 3 వ. చూర్ణమును గాని, ఫెరంఫాస్ 3 వ. చూర్ణమునుగాని, ౩౦ గ్రైయిను లొక యవున్సువాసలైనునందు గలిపి గుహ్యద్వారమునకు బట్టించవలయును.

ఈ రోగికి ధారాళముగ విరేచన మగు పథ్యమును బెట్టుచుండవలయును.

## (౬౬) పొంగు

దగ్గు పడిసెముతోడ నీవ్యాధి ప్రారంభ

మగును. జ్వరము వచ్చిన నాలుగవ దినమున ముందు కపాలమునను, మోము నందునను, తర్వాత శరీరమం దంతటను, యెఱ్ఱని పొక్కులు లేచును. పొక్కులు లేచుట పూర్తియైనంతనే జ్వర మాగిపోవును. పిమ్మట నాలుగయిదు దినములలో నా పొక్కులు నయమగును.

చికిత్స :—ప్రథమావస్థయందు, ఫెరంఫాస్ ౬ మ. చూర్ణమును దినమునకు మూడు నాలుగు మాఱు లీయవలయును.

పడిసె ముండినయెడల ఫెరంఫాస్ తోడ నెట్రంమ్యూర్ ౬ మ. చూర్ణమును, పర్యాయ క్రమముగ నీయవలయును.

పొక్కులు బాగుగ కనబడు నప్పుడు, ఫెరంఫాస్‌ను, కాలీమూరు ౬ మ. చూర్ణమును పర్యాయక్రమముగ రోజునకు నాలు గయిదు మాఱు లీయవలయును.

పొక్కు లణగిపోవు నప్పుడు, కాలీసల్ఫు ౬ వ. చూర్ణమును దినమునకు నాలుగుమాఱు లీయవలయును.

పొంగు నయమైన పిమ్మట, శరీరమునకు బలము వచ్చుటకుగాను, క్యాల్కేరియాఫాస్ ౬ వ. చూర్ణమును దినమునకు రెండుమాఱు లీయవలయును.

ఈరోగిని చీకటి ఇంటియందు బరుండ బెట్ట వలయును. కాని, యా గదిలోనికి విశుద్ధమగు వాయువు మాత్రము వచ్చుచుండ వలయును. రోగి శరీరమునకు చలిగాలి మాత్రము తగుల గూడదు. చలిగాలి తగిలినయెడల నొకప్పుడు ప్రమాదము గలుగ వచ్చును. గృహమందలి వేడిమిని సమముగ గాపాడుకొనుచుండవల యును. రోగిశరీరము నెప్పుడు వస్త్రముతో గప్పి యుండవలయును.

## (౬౭) ప్రసవవేదన

ప్రసవకాలమందు సాధారణముగ వేదన యుండును. కాని, యది స్వాభావికము. వేదన మిక్కుటమగునప్పుడు మాత్రము చికిత్స చేయ వలయును.

చికిత్స:—గర్భోత్పత్తినుండియు దినమునకు రెండు మోతాదులు కాలీఫాస్ ౬ వ. చూర్ణ మును బుచ్చుకొనుచుండిన యెడల గర్భిణులు సుఖప్రసూత లగుదురు.

ప్రథమమునుండియు దినకున్నను, ప్రసవ వేదన ప్రారంభించినంతనే కాలీఫాస్ 3 వ. చూర్ణమును, అరగంట కొకమా టీయవలయును. రెండు మూడు గంటలలో సుఖప్రసవమగుదురు.

ప్రసవవేదన గాక వట్టి నొప్పులు ప్రారంభించినయెడల మ్యాగ్నెసియా ఫాస్ ౬ వ. చూర్ణమును, రెండుగంటల కొకమాఱు వేడి నీళ్లతోడ నీయవలయును.

కొందఱకు వట్టి నొప్పు లాగినంతనే ప్రసవ వేదన ప్రారంభమగును. అప్పుడు కాలీఫాస్‌ను 30 నిముసముల కొకమా ఱీయవలయును. అందువలన సుఖముగా ప్రసవింతురు.

గర్భావస్థయందు విరేచనబద్ధక ముండిన యెడల క్యాలికేరియాఫ్లవరు ౬ మ. చూర్ణము నీయవలయును.

ప్రసవకాలమందు మల మధికముగ జేరి యుండుటవలన వట్టినొప్పులు వచ్చుచుండును. అందువలన పిచికారిచేసి మలమును దీసివేయ వలయును. మరియు, క్యాలికేరియాఫ్లవరును రెండుగంటల కొకమాఱు వాడవలయును.

ప్రసవానంతరము ఫెరంఫాస్ ౬ మ. చూర్ణ మును కాలీఫాస్ ౬ మ. చూర్ణమును రెండు గంటల కొకమా ఱీయవలయును.

ఫెరంఫాస్ 3 మ. చూర్ణము, ఉష్ణజలమందు గలిపి ప్రసవద్వారమును గడుగవలయును.

ఇందువలన వేదనయు రక్తస్రావము నడంగును. ప్రసవానంతరము, మలిన రక్తము స్రవించక బాధయుండినయెడల, క్యాలికేరియా ఫ్లవరు ౬ మ. చూర్ణమును రెండుగంటల కొక మా త్రీయవలయును.

శరీరమునకు బలము వచ్చుటకును, ఆకలి వృద్ధి యగుటకును, క్యాలికేరియాఫాస్ ౬ మ. చూర్ణమును దినమునకు నాలుగు మాత్రలు పుచ్చుకొనుట మంచిది.

## (౬౮) ప్లీహము

డొక్కయందు 'ప్లీహ' మను యంత్రము ఉండును. అది యనేకరోగములతోడను, మలేరియా జ్వరమప్పుడును, నుబ్బుచుండును. కావున నావాపు తీయుటకై చికిత్స చేయవలయును.

చికిత్స:—ప్లీహమువాచినయెడల కాలీమ్యూరు ౬ మ. చూర్ణమును రెండుమూడు గంటల

కొకమాలు పుచ్చుకొనవలయును. దీనిని సేవిం చుటవలన నాలుక తెలుపు, మయిల, విరేచన బద్ధకము, నయమగును.

మిక్కుటముగ 'క్వయినాను' దినుటవలన నిది సంభవించిన యెడల నెట్రంమ్యూర్యు ౬ మ. చూర్ణమును రోజునకు రెండుమూడు మాలులు వాడవలయును.

మలేరియాజ్వరజనిత మైన యెడల, నెట్రం సల్ఫు ౬ మ. చూర్ణమును, రోజునకు రెండు మూడుమాలు లీయవలయును.

ప్లీహాము మిక్కిలి పెద్దదై గట్టిగానుండినచో, క్యాలికేరియా ఫ్లవరు ౬ మ. చూర్ణమును మూడు గంటల కొకమా ఱీయవలయును. జ్వర ముండిన ఫెరంఫాస్, ౬ మ. చూర్ణమును దిన మునకు రెండుమూడు మాలు లీయవలయును.

క్యాలికేరియా ఫ్లవరునుగాని, కాలీమూరును గాని, 3 మ. చూర్ణము 30 గ్రయిను లొక

యవున్ను వాసలయినునందు గలిపి, దానిని ప్లీహ ముండు స్థలమునకు పైభాగము నందు బట్టించవలయును. కాపు గూడ పట్టవలయును.

శరీరబలమునకుగాను, క్యాలి కేరియాఫాస్‌ను రోజునకు రెండుమాఱు లీయవలయును.

విరేచనము ఝూడించి యగుటకు ప్రయత్నించవలయును. పాలు ద్రాగవచ్చును. పాత బియ్యపన్నము, రొట్టె, మొదలగు వానిని దిన వచ్చును. పండ్లు దినుట మంచిది. జ్వరము లేని యెడల శీతలజలస్నానమును జేయవలయును. విశుద్ధమగు వాయువునందు కొలదికాలము సంచరింప వలయును.

(౬౯) బట్టతల - పేను కొఱుకుట

తలయందు వరుసగా వెంద్రుక లూడి యా స్థలమున మఱల వెంద్రుకలు రాకుండుటను బట్ట తల యని చెప్పుదురు. ఇందువలన మిగిలిన

వెంద్రుకల కోమలత్వము నశించును. కొంత మందికి వెంద్రుకలు కుదుళ్లతోడ నూడు చుండును. దానిని పేనుకొఱుకుట యందురు. పలువిధము లగు పురాతనవ్యాధులవలనను, రక్త హీనతవలనను, దుర్బలత్వమువలనను, బట్టతల, పేనుకొఱుకుట మొదలగువ్యాధులు గలుగును.

చికిత్స:—ఉదయమున సయిలీసియా ౧౨ వ. చూర్ణము నొక్కమాఱును, సాయంత్రము నెట్రంమ్యూరు ౧౨ వ. చూర్ణమును నొక్క మాఱును బుచ్చుకొనవలయును.

రక్తహీనతవలనను, దుర్బలత్వమువలనను, ప్రసవానంతరమును, గొప్పవ్యాధిపీడితు లయిన పిమ్మటను, వెంద్రుక లూడుచుండినయెడల, ఉదయమున క్యాలికేరియాఫాస్ 3 వ. చూర్ణము నొక్కమాఱును, సాయంత్రము నెట్రంమ్యూరు ౧౨ వ. చూర్ణము నొక్కమాఱును బుచ్చుకొనవలయును.

వెంట్రుకలు కఠినముగను, కోమలతావిహీనమై యుండినను, పేను కొఱుకుచుండినను, కాలీసల్ఫ ౬ వ. చూర్ణమును దినమునకు రెండుమాఱులు పుచ్చుకొనవలయును.

బట్టతలయై వెంట్రుక లూడుచుండినయెడల నెట్రంసల్ఫను బుచ్చుకొనవలయును.

ఈ వ్యాధిగలవారలు వేడిని గలిగించు తైలములను తల కుపయోగింపజనదు. కొబ్బరి నూనెను, బాదమీనూనెను, తలకు రాచుకొనవచ్చును. తల నెప్పుడు తైలావృతముగ నుంచుకొనవలయును. తలకు రాచుకొను నూనెలయందు పైన వివరించిన మందులో నేది యవసరమో, దానిని గలిపి, తలకు రాచుకొనుచుండుట యుత్తమము. శీతల జలస్నానము మంచిది. పేను కొఱుకుచోట కాలీసల్ఫ, మలామును బట్టించవలయును. బట్టతలకు నెట్రంసల్ఫ మలామును బట్టించవలయును.

## (౭౦) బెణుకు

దెబ్బ తగులుటవలన గాని, క్రిందపడి పోవుటవలన గాని, లేక యే యితరకారణముల వలన నైనను, శరీరమందలి యే భాగమయినను, బెణుకును. సాధారణముగ నిది చేతులు కాళ్లకు వచ్చుచుండును. బెణుకు పట్టిన స్థలమందు మిక్కిలి బాధగా నుండును.

చికిత్స:—ఫెరంఫాస్ ౬ వ. చూర్ణమును రెండుగంటల కొకమాఱు పుచ్చుకొనవలయును. ఫెరంఫాస్ 3 వ. చూర్ణమును బెణుకుపట్టిన స్థలమందు వేడినీటితోడ పట్టించవలయును.

## (౭౧) భగంధ్రము

గుహ్యద్వారముచుట్టు తూట్లుపడిన యెడల దానిని భగంధ్రమని చెప్పుదురు. ఈతూట్లు కొన్ని సమయములయం దెండి యుండును. ఒకప్పుడు చీము వచ్చును. అప్పు డప్పుడు

రక్తముతో గూడిన చీముగూడ వచ్చుచుండును. కొందఱకు మలము, వాయువు, గూడ నీ 'తూట్ల' నుండి బహిర్గత మగుచుండును.

చికిత్స:—సిలీసియా 30 మ. చూర్ణమును గాని యంతకు మించిన సంఖ్యలను గాని దినమునకు రెండుమాఱులు పుచ్చుకొనవలయును.

భగంధ్రము చుట్టును, గట్టిగా నుండిన యెడల, సాయిలీసియాతోడ క్యాలికేరియాఫ్లవరును పర్యాయక్రమముగ బుచ్చుకొన వలయును.

క్షయదగ్గుతోడ నీవ్యాధి యుండినయెడల, ఒకవారము క్యాలికేరియాఫాస్ ౧ మ. చూర్ణమును దినమునకు ముమ్మారును, రెండవవారము సయిలీసియా, ౬ మ. చూర్ణమును దినమునకు రెండుమాఱుల చొప్పునను కొన్నివారములు పుచ్చుకొనిన నయమగును.

## (౭౨) మశూచికము

జ్వరము, నడుమునొప్పి, వమనము వచ్చు నటు లుండుట, వమనమగుట, శరీర మంతయు నొప్పులు, మొదలగు వానితోడ నీవ్యాధి ప్రారంభమగును. జ్వరము వచ్చిన నాల్గవ దిన మున, ముందు మోమునందునను, గొంతు మీ దను, పిమ్మట శరీరమం దంతటను నల్లని పొ క్కులు లేచును. ఏడవదినమందు వానిలో జల సంబంధమగు పదార్థము గూడుకొనును. అవి తొమ్మిదవ దినమున పక్వమగును. చీముగా మాఱును. ౧౨ వ దినమునుండియు నవి యెండి పోవును. ఆ పొక్కులు లేచిన స్థానమందు గుంటలు పడును. సాధారణముగ, పొక్కులు గనబడినంతనే జ్వర మాగిపోవును.

చికిత్స :—ప్రథమావస్థయందు ఫెరంఫాస్ ౬ వ. చూర్ణమును, కాలీమూరు ౬ వ. చూ

ర్ణమును, రెండుగంటల కొకమాఱు పర్యాయ క్రమముగ నీయవలయును. అతిదాహ ముండిన యెడల కాలీమూరుత్తోడ, నెట్రంమ్యూరు ౽ మ. చూర్ణమును గలిపి యీయవలయును.

పొక్కు లెండిపోవు నప్పుడు, కాలీసల్ఫు ౽ మ. చూర్ణమును మూడుగంటల కొకమా ఱీయవలయును.

దుర్బలత్వము నశించుటకు గాను, క్యాలికేరియా ఫాస్ ౽ మ. చూర్ణమును రెండుగంటల కొకమా ఱీయవలయును.

పథ్యము:—బలమును గలిగించునట్టివియు, అతిసులభముగ జీర్ణమగునట్టివియు నగు, పదార్థములను మాత్రమే పెట్టవలయును. పాలు, బార్లి జావ యిచ్చుచుండవలయును. రోగిని తలుపులు వేసిన చీకటిగదియం దుంచవలయును. చలిగాలి తగులగూడదు. మాంసము, చేపలు మొదలగు వానిని దినగూడదు.

## (౭౩) మలబద్ధకము

దీని నింగ్లీషునందు, 'కాన్‌స్టిపేషన్' అని చెప్పుదురు.

మలబద్ధకము, చిరకాలీన మనియు, తాత్కాలిక మనియు రెండు తెఱంగులు. చిరకాలమునుండి మలబద్ధక ముండి సహజముగ విరేచనము గానియెడల దానిని చిరకాలీన మలబద్ధక వ్యాధి యనియును, భోజనపదార్థములయందలి లోపమువలనను, నేదయిన రోగము వచ్చినప్పుడును, మలబద్ధక ముండిన యెడల దానిని తాత్కాలిక మనియును జెప్పుదురు.

చికిత్స:—మలబద్ధకముతోడ, నాలుకవర్ణము, మలము, తెలుపుగ నుండినయెడలను, కార్జమునం దేదయిన వికృతి గలిగినను, కాలీమూరు ౬ మ. చూర్ణమును మోతాదుకు ౩-౭ గ్రెయినుల చొప్పున రెండుగంటల కొకమాఱు పుచ్చుకొనవలయును.

మలము గట్టిగనుండి, మలవిసర్జనమందు గుహ్యాద్వారము చీరుకొని పోవుచుండినయెడల నెట్రంమ్యూర్యు ౬ మ. చూర్ణమును రోజునకు మూడు నాలుగుమాఱులుపుచ్చుకొనవలయును.

పెంటికలుగ విరేచనమగుటయు, విరేచనము కొంత వెలుపలకు వచ్చి యది తిరిగి లోపలకు బోవుచుండిన యెడల, సాయిలీసియాను దినవలయును. చిరకాలీన మలబద్ధకవ్యాధి గలవారలు, నెట్రంమ్యూర్యు 30 మ. చూర్ణమును, సాయిలీసియా, 30 మ. చూర్ణమును గలిపి రోజునకు రెండుమూడుమాఱులు తినుచుండవలయును. అందువలన ప్రతిదినము విరేచనమగుచుండును.

పురాతన మలబద్ధకరోగమునకు ప్రధానౌషధము కాలీసల్ఫు. కావున నీ యౌషధము ౬ మ. చూర్ణమును రోజునకు రెండు మూడు మాఱులు పుచ్చుకొనవలయును.

క్యాలికేరియాఫ్లవరు ౧౨ మ. చూర్ణమును దినమునకు రెండుమారులు దినుచుండిన యెడల మూలశంకరోగికి విరేచన మగుచుండును.

పైత్యాధిక్యముచే విరేచనబద్ధకము గలిగిన యెడల, నెట్రంసల్ఫు ౬ మ. చూర్ణమును, కాలీమూరు ౬ మ. చూర్ణమును పర్యాయక్రమముగ బుచ్చుకొనవలయును.

ఆమ్లాధిక్యమువలన విరేచనబద్ధక మేర్పడిన యెడల నెట్రంఫాస్ ౬ మ. చూర్ణమును, కాలీమూరు ౬మ. చూర్ణమును పర్యాయక్రమముగ బుచ్చుకొనవలయును.

మలబద్ధకపురోగులు ఫలములను దినుచుండవలయును. ముఖ్యముగ, కండగలిగిన, అంజూర, అరటి, చక్రకేళిపండ్లను, కోతమామిడిపండ్లను దినుచుండవలయును. పాలయందు కిసిమిస్ పండును గలిపి, వానిని కాచి త్రావుచుండిన యెడల ఝాడించి విరేచనమగును. మాంసా

హారమును ముట్టజనదు. సకాలమునకు విరేచ
నము వచ్చినను రాకున్నను బహిర్దేశమున కేగి
కొంతవడి విరేచనమగుటకు బ్రయత్నించవల
యును. పనిపాటలు లేక సోమరులుగ నుండు
వారికి వ్యాధి గలుగుచుండును. కావున వారు
బాగుగ నడుమువంచి పనిచేయుచుండవలయును.
నిద్దుర లేవగనే గోరువెచ్చని నీటిని, కడుపునిండ
త్రాగవలయును. ఉదయము, సాయంత్రపువేళల
యందు మంచిగాలి వీచు ప్రదేశములయందు
తీవ్రముగ నడుపవలయును. శీతలజల స్నానము
చేయుచుండవలయును. వెంటనే విరేచన మగు
నట్టి మందులను దినగూడదు. అందువలన నప
కారమే గాని యుపకారము గలుగదు.

## (౭౮) మూలశంక

దీనిని ఇంగ్లీషునందు 'పైల్సు' అని చెప్పు
దురు.

ముక్కు-చెవులు-స్త్రీజననేంద్రియకోశము-

గుహ్యద్వారములయందు మూలశంక పుట్టు చుండును. గుహ్యద్వారమందు బుట్టినదానిని మూలశంక యనియును, ముక్కు మొదలగు వానియందు బుట్టిన "పాలిఫస్" అనియును చెప్పుచుందురు.

గుహ్యద్వారమందలి మూలశంక రెండు విధములు.

(౧) మొదటివిధమగు మూలశంక గుహ్య ద్వారమందేయుండి వెలుపలకు రాదు. అప్పుడు సాధారణముగ రక్తము గారుచుండును.

(౨) రెండవవిధమగు మూలశంక గుహ్య ద్వారము వెలుపలకు వచ్చును. కాని యప్పుడు సాధారణముగ రక్తము గారదు.

ఈవ్యాధి గలిగిన వారి కార్శ్యము చెడును. అజీర్ణవ్యాధి యుండును. అప్పుడప్పుడు నీళ్ల

విరేచనము లగుచుండును. సాధారణముగ విరేచనబద్ధక ముండును. అప్పుడప్పుడు మూల శంకయందు తీపు, పోటు, నడుమునొప్పి గుహ్య ద్వారమందు మంటయుండును. మిక్కిలి యజీర్ణ మొనర్చు పదార్థములను దినుటవలనను, ఉద్రే కమును గలిగించు ఆహారమును, పానీయము లను ద్రాగుటవలనను, సోమరిపోతుగ నుండుట వలనను, నీవ్యాధి గలుగుచున్నది.

చికిత్స:—మూలశంకతోడ రక్తస్రావ ముండినయెడల నారక్తవర్ణమును బట్టి మందు వాడ వలయును.

రక్తము మిక్కిలి యెఱ్ఱగా గాఱుచుండిన యెడల, ఫెరంఫాస్ 3 మ. చూర్ణమును రెండు గంటల కొకమాఱు వాడవలయును.

రక్తము నల్లగను పలుచగను నగుచుండిన యెడల కాలీమూరు ౬ మ. చూర్ణమును రెండు గంటలకొకమా. జేయవలయును.

క్యాలికేరియా ఫ్లవరు, మూలశంకవ్యాధికి ముఖ్యౌషధము. కావున దీనితోడ మిగిలిన మందులను గలిపి కాని, పర్యాయక్రమముగా గాని, వాడుచుండ వలయును. కావున క్యాలి కేరియా ఫ్లవరు ౬ x. చూర్ణమును నిచ్చుచుండ వలయును. మూలశంకవాచి పోటు తీపులుండిన యెడల ఫెరంఫాస్‌ను చలిపిటియందు గలిపి, యానీటిని గుహ్యద్వారమందు పలుమారు పిచికారి చేయవలయును. లేక, గ్లిసరైనుతో గలిపి పట్టువేయవలయును. విరేచనము పల్చ గానగు పదార్థములను మాత్రమే దినుచుండ వలయును. విరేచనము గానియెడల పిచికారి తోడ మలమును వెలుపలకు వచ్చునట్లు చేయ వలయును.

శరీరమం దితరచోట్ల బుట్టిన "ఫలిఫస్" లకు క్యాలికేరియాఫాస్ క్యాలి'సల్ఫ' నెట్రం మ్యూరు మొదలగువాని నీయవలయును.

మూలశంక బాగుగ నయము గావలయు ననిన దానికి మూలమగు, అజీర్ణమును, కార్జ ముల వికృతియు బాగుగ నయముగావలయును.

ఈవ్యాధిగలవారలు రసముండుపండ్లు దిను చుండుటమంచిది. మఱియు మలము పల్చగనగు నట్టి పదార్థములను మాత్రమే తినుచుండవల యును. గట్టిపడు పదార్థములను దినగూడదు. శీతల జలస్నానము మంచిది. అలసస్వభావ మునువీడి వ్యాయామ మొనర్చుచుండవలయును. చల్లనిగాలియందు దిరుగుచుండవలయును. ఉద్రే కమును గలిగించునట్టి యాహార పానీయములను గైకొనరాదు. పరుపులమీద బరుండరాదు. గూర్చుండగూడదు.

## (౭౫) మూర్ఛ

యౌవనకాలమందు ఎక్కువగ నింద్రియ వ్యయ మగుటవలనను, పలువిధము లగు చర్మ

ర్యాధులవలనను, ఈ వ్యాధి గలుగు చున్నది. స్త్రీలకంటె పురుషులకే, యౌవనావస్థయం దేవ్యాధి వచ్చుచుండును. ఆకస్మికముగ రోగి చైతన్యవిహీను డై పడిపోవును. నోటివెంట తెల్లనిచొంగ కాఱును. ఇట్లు కొంతసే పుండి, యెక్కుడుగ మూత్రమును విడచిన గాని, పెద్ద విరేచనమైన పిమ్మటగాని, రోగికి తెలివి వచ్చును. ఇది యాకస్మికముగ వచ్చుచు గాన, నీరు, నిప్పు మొదలగునవి చేరువ నుండరాదు. అట్టివి సమీపమునందు లేనియెడల సాధారణముగ ప్రాణ భయ ముండదు.

చికిత్స :—ఆకస్మికముగ, చర్మవ్యాధిగ్రస్తు డగుటవలన నిది సంభవించినచో, కాలీమూరు ౬ వ. చూర్ణమును దినమునకు నాలుగయిదు మాఱు లీయవలయును.

అపరిమిత మగు, ధాతుక్షయమువలన నీ వ్యాధి గలిగిన యెడల క్యాలికేరియా ఫాస్

౬ మ. చూర్ణమును దినమునకు నాలుగయిదు మాఱు లీయవలయును. పురుగు లుండుటవలన మూర్ఛ వచ్చినచో, నెట్రంఫాస్ 3 ను. చూర్ణ మును రోజునకు రెండు మూడుమాఱు లీయవల యును.

ఈ వ్యాధి వచ్చునప్పుడు దంతములయందు వక్క మొదలగువాని నుంచుకొన వలయును. లేనియెడల నోరు బిగియునప్పుడు నాలుక తెగి పోవును.

## (౭౬) మూత్రావరోధము

మూత్రము కొందఱకు మూత్రస్థలియందు నిలిచి యుండును. కొందఱకు మూత్రగ్రంథి (కిడ్నీ) యందు తయారుగాదు. ప్రమేహము, ఇష్టీరియా, నరములసంబంధ మగు వ్యాధుల తోడ, మూత్రస్థలియందు మూత్రము నిలిచి పోవును. కలరా వ్యాధియందు మూత్రస్థలి యందు మూత్రము బంధింపబడును. కొందఱకు

మూత్రగ్రంథియందు మూత్రము తయారు గాదు. మూత్రస్థలియందు మూత్రము బద్ధమై యుండినయెడల పొట్టయుబ్బును. మూత్రగ్రంథియందు మూత్రము తయారుగానియెడలనడుము నొప్పిగను, కన్ను లెఱ్ఱగ నుండును. జ్వర ముండును.

చికిత్స:—మూత్రము, మూత్రస్థలియందు గూడుకొనినదా, లేక, మూత్రగ్రంథియందు తయారు గాలేదా, యను విషయమును ముందుగ విచారించవలయును. ప్రస్రావము నిస్సృతమై. మూత్రస్థలియందు బంధింపబడినయెడల నెట్రంసల్ఫు 3 లేక, ౬ మ. చూర్ణమును, అరగంట కొకమారు జేయవలయును.

నరములు లాగుకొనిపోవుటవలన నీ వ్యాధి సంభవించినయెడల మ్యాగ్నెసియాఫాస్ 3 మ. లేక, ౬ మ. చూర్ణమును, వేడినీటితోడ ౧౫-30 నిముసముల కొకమారు జేయవలయును. పొట్టకు

ఆవిరి పట్టవలయును. రోగిని గోరువెచ్చని నీటి తొట్టియందు గూర్చుండబెట్టవలయును.

రాళ్లుండుటవలన మూత్రము బంధింపబడినచో యంత్రముతోడ మూత్రమును వెలుపలకు వచ్చునటుల జేయవలయును.

మూత్రయంత్రము (కిడ్నీ)యందు తయారుగానియెడల, ఫెరంఫాస్, ౬ ఎ. చూర్ణమును, నెట్రంఫాస్ ౬ ఎ. చూర్ణమును, గలిపిగాని, పర్యాయక్రమముగ గాని రెండుగంటల కొకమా ఱీయవలయును. నడుమున కావిరిని బట్టవలయును.

పక్షవాతమువలన మూత్రము బంధింపబడినయెడల కాలీఫాస్ ౬ ఎ. చూర్ణమును బుచ్చుకొనవలయును.

అల్పాచమానమునకు సహకారి యగు పథ్యమును బెట్టవలయును.

పాలు, జావ, గంజి, మొదలగువానిని త్రావ
వచ్చును.

## (౭౭) మెడబెణుకు

జలుబు చేయుటవలన మెడనరములు రెండు వైపులగాని యొకవైపున గాని బిగబట్టును. అందువలన తల నెట్లు కదలించినను మిక్కిలి కష్టముగ నుండును.

చికిత్స:—ఫెరంఫాస్ ౬ వ. చూర్ణమును రెండుగంటలకొకమారు పుచ్చుకొనవలయును. మఱియు, ఫెరంఫాస్ 3 వ. చూర్ణమును 30 గ్రెయినులు లోకయవున్సు వ్యాసలైనునందు గలిపి దానిని మెడనరములకు బట్టించవలయును. కాపు పట్టవలయును. చలిగాలి తగులకుండ మెడచుట్టు ఫ్లానలు గుడ్డను గట్టుకొనవలయును. బల్లమీద గాని, నేలమీద గాని, చాప వేసికొని పరుండ వలయును.

## (౭౮) మొటిమలు

యౌవన కాలమందు, స్త్రీ పురుషులకు, మోమునందు మొటిమలు లేచును. అవి యేవిధమగు బాధను గలిగించవు. వానియందు చీముపట్టదు. కాని వానిలో గట్టిగనుండు తెల్లనిపదార్థ ముండును. మొటిమలను ఒత్తినయెడల యందుండు తెల్లనిపదార్థము వెలుపలకు వచ్చును. పిమ్మట నా స్థానము గట్టిపడును.

యౌవనకాలమందలి దురభ్యాసముల వలనను, ఋతుసంబంధమగు వ్యాధులవలనను, మొటిమలు పుట్టుచుండును. ఇందువలన మోమసహ్యముగనుండును. కొందరియందు కివి చాల దినములవఱ కుండును. మాంసమును వేడిపదార్థములను ఉత్తేజనము గలిగించు పదార్థములను దినుటవలన నీవ్యాధి గలుగుచున్నది.

చికిత్స:—ఋతుస్రావసంబంధమగు నియమ హీనతవలన మొటిమలు లేచినయెడల నెట్రం

మ్యూరు ౧౨ వ. చూర్ణమును, లేక ౩౦ వ. చూర్ణమును, ఉదయమున నొక మోతాదును, సాయంత్ర మొక మోతాదును, బుచ్చుకొనవల యును. రక్తవిహీనమై యుండినయెడల నిది మిక్కిలి పనిచేయును.

మొటిమలనుండి తెల్లనిపదార్థము, పెరుగు, నేయివలె వచ్చుచుండిన యెడల, కాలీమూరు ౬ వ. చూర్ణమును రోజునకు మువ్మాఱు దిన వలయును. యౌవనమువలన మొటిమలు లేచి నచో క్యాలికేరియాఫాస్ 3 లేక, ౬ వ. చూర్ణమును దినమునకు రెండుమూడుమాఱులు పుచ్చుకొన వలయును. ఇందువలన, నజీర్ణము మొదలగునవి నశించును. మఱియు క్యాలికేరి యాఫాస్ ౧ వ. చూర్ణమును ౬౦ గ్రేయిను లొకయవున్సు చలినీళ్లయందు గలిపి ఆనీటిని మోమునకు బూసికొనవలయును. ఇందువలన మొటిమ లాగిపోవును.

పిండివంటలు మొదలగు పదార్థములను దిన రాదు. ఝూడించి విరేచన మగు పదార్థములను మాత్రమే తినుచుండవలయును. శీతలజల స్నాన ముత్తమము. కాళ్లు చేతులు మోమును వేడినీళ్లతో గడుగుకొనరాదు. విశుద్ధమగు గాలి యందు దిరుగవలయును. శరీరస్థితి ననుసరించి వ్యాయామమును జేయుచుండవలయును.

## (౭౯) రక్తస్రావము

ఏకారణమువలన నైనను, ఎచ్చట నుండి యైనను, రక్తము గాఱినయెడల దానిని రక్తస్రావ మందురు. శరీరమం దనేకస్థలములనుండి రక్తము గాఱుచుండును. నాసిక, మోము, ఊపిరితిత్తులు, మూత్రద్వారము,(స్త్రీలకు ఋతువునం దెక్కుడయినను రక్తస్రావ మందురు) గుహ్యద్వారము నుండియు, రక్తస్రావ మగుచుండును. ఆయా స్థానములను బట్టి వానిని వేఱువేఱు నామముల

బిలుచుచుందురు. కాని యన్ని విధము లగు రక్త స్రావములకును చికిత్స యొకేవిధముగ జేయవలయును.

చికిత్స:—రక్త మెట్టగ నుండిన యెడల ఫెరంఫాస్ ౬ మ. చూర్ణమును రెండుగంటల కొకమా టీయవలయును.

రక్తము నల్లగను, కండలు కండలుగ పడు చుండినయెడల కాలీమూరు ౬ మ. చూర్ణమును రెండుగంటల కొకమాఱు వాడవలయును.

నిక్కిలి మెరుపుగ నుండినయెడల కాలీఫాస్ ౬ మ. చూర్ణమును రెండుగంటల కొకమా టీయవలయును.

నీళ్లవలె రక్తస్రావము కడు పలుచగ నగు చుండినయెడల నెట్రంమ్యూర ౧౨ మ. చూర్ణమును లేక, ౩౦ మ. చూర్ణమును వాడవలయును.

రక్తవిహీనరోగికి రక్తస్రావ మైన యెడల క్యాలికేరియాఫాస్ ౬ ను. చూర్ణమును సేవించవలయును. కొందఱు క్యాలికేరియాప్లవరు వలన గూడ గుణమిచ్చును.

నెట్రంసల్ఫు ౧ ను. ౬ ను. చూర్ణముల దనుకనుండు సంఖ్యలను వాడినయెడల రక్తస్రావ మాగునని కొందఱ యభిప్రాయము. ఇందువలన గుణము గనబడును.

ఏ విధమగుదెబ్బ తగిలినను, కోసికొనిపోయినను, ఫెరంఫాస్ 3 ను. చూర్ణము నచ్చట వేసి కట్టుకట్టవలయును. ముక్కునుండి రక్తముగాఱునప్పుడు ఫెరంఫాస్‌ను నస్యమువలె బీల్చవలయును. ఈ రోగి శయనించియుండుట మంచిది.

(౫౦) రక్తాశయము

రక్తమిశ్రిత మగు, శ్లేష్మముతోడ, వెంట వెంటనే విరేచనము లగుచుండినయెడల, దానిని

ఇంగ్లీషునందు 'డిసెంట్రీ' అని చెప్పుదురు. కొందఱకు, రక్తమిశ్రిత శ్లేష్మమును, కొందఱకు కేవలము రక్తమును, కొందఱకు కేవలము శ్లేష్మమును పడుచుండును. ఆ విరేచన మగునప్పుడు బాధయుండును. విరేచనము వర్ణము, కొందఱకు నలుపుగను, మఱికొందఱకు ఎరుపు - పసుపు- ఆకుపచ్చని వర్ణములతోడ నగుచుండును. ఈ విరేచనముల ప్రారంభదశయందు కొందఱకు జ్వరముగూడ నుండును. పేగులలో పూత బూయుట వలనను, భోజన పదార్థములయందలి దోషములవలనను, ఆకస్మికముగ జలుబుచేయుట వలనను, నీవ్యాధి గలుగుచున్నది. మలము యొక్క వర్ణము తఱుచుగ మాఱుచుండును.

చికిత్స:—కాలీమూరు ౽ ను. చూర్ణమును రెండుగంటలకొకమాఱు పుచ్చుకొనవలయును. ఇదియే దీనికి ప్రధానమగు మందు.

కడుపు మెలివేయుట, బాధ యుండినయెడల

కాలీమూరుతోడ పర్యాయక్రమముగ మ్యాగ్నిసియాఫాస్ ౬ మ. చూర్ణమును వేడినీళ్ల తోడ నీయవలయును.

జ్వర ముండినను, రక్తముతో గలసి విరేచన మగుచుండినను, ఫెరంఫాస్ ౬ మ. చూర్ణమును కాలీమూరుతోడ పర్యాయ క్రమముగనీయ వలయును.

కేవలము రక్తము మాత్రమే పడుచుండిన యెడల కాలీఫాస్ ౬ మ. చూర్ణమును వాడ వలయును.

రక్తముతోడ చీము గూడ బడుచుండిన యెడల క్యాలి కేరియాసల్ఫు ౬ మ. చూర్ణమును వాడిన గుణమిచ్చును.

శరీరబలమునకు గాను క్యాలి కేరియా ఫాస్ ౬ మ. చూర్ణమును దినమునకు రెండుమూడు మాఱు లీయవలయును.

ఇది పురాణవ్యాధిగా మాఱినయెడల దాని లక్షణములను బట్టి వైద్యము చేయవలయును. పొట్టకు ఆవిరి పెట్టవలయును. కాపుపెట్ట వలయును. పొట్టకు ఫ్లానలుగుడ్డను చుట్టవలయును. పాతబియ్యపు అన్నము, జావ మొదలగు వానిని దినవలయును. గంజి త్రాగవచ్చును.

(౮౧) రాచకురుపు

ఇది మిక్కిలి దుష్టవ్రణము. ఈ కురుపు శరీరమందనేకస్థలములయందు లేచును. చాల కురుపుల సముదాయమును రాచకురుపని చెప్పుదురు. సాధారణముగ నీ కురుపుతోడ జ్వరము వచ్చుచుండును. దుర్బలత్వమువలనను, రక్తము చెడుటవలనను, నీకురుపు పుట్టుచున్నది.

చికిత్స:—ప్రథమావస్థయందు, ఫెరంఫాస్ ౬ మ. చూర్ణమును, క్యాలికేరియా ఫ్లవరు ౬ మ. చూర్ణమును, పర్యాయక్రమముగ,

రెండుగంటల కొకమాఱు తీయవలయును. మఱి యు, ఫెరంఫాస్ 3 మ. చూర్ణమును, వేజిసిటి యందుగలిపి కురుపుమీద పట్టువేయవలయును.

దానివలన గుణము గనుపడనియెడల క్యాలి కేరియాఫ్లవరు ౬ మ. చూర్ణముతోడ సాయిలీ సియా ౬ మ. చూర్ణమును గలిపిగాని, పర్యాయ క్రమముగా గాని, యిచ్చినయెడల నయమగును. లేనియెడల కురుపు పగిలి చీముకారును.

పగిలి చీము గారునప్పుడు సాయిలీసియా ౧౨ మ. చూర్ణమును లేక 30 మ. చూర్ణ మును రోజునకు మూడు నాలుగుమాఱు లీయ వలయును. మఱియు, ఆవిరి పట్టుచుండ వలయును.

ఈ కురుపు భయంకరరూపమును దాల్చి నప్పుడు, కాలీఫాస్ ౬ మ. చూర్ణమును, సాయి లీసియా ౧౨ మ. చూర్ణమును పర్యాయక్రమ ముగ నీయవలయును.

జ్వర ముండినయెడల నీ కురుపు ప్రమాద మును గలిగించు నని తలంచవలయును. జ్వర ము ౧౦౪ డిగ్రీలుండినను, కురుపుచుట్టు నుండు చర్మము నల్లపడినను, ఆ కురుపు నయమగుట కష్టము. కావున నప్పుడు డాక్టరుల సహాయ మును బొందుట మంచిది.

చేపలు, మాంసము, బెల్లము, పంచదార మొదలగువానిని భుజింపరాదు. పాలు త్రాగ వచ్చును. బలకర మగు ఆహారమును భుజింప వలయును.

## (౮౨) రాళ్లు

సాధారణముగ మూత్రస్థలియం దే రాళ్లు పుట్టుచుండును. పసరుతిత్తియందును (పిత్తస్థలి) మూత్రయంత్రము (కిడ్ని) యందుగూడ రాళ్లు బుట్టుచుండును. ఆయాస్థానములనుబట్టి యీరోగ మునకు వేఱువేఱు నామములు గలవు. మూత్ర

యంత్ర (కిడ్నీ) యందు రాళ్లు పుట్టినయెడల నడుమునొప్పి యుండును. పొట్టంతయు తీపుగా నుండును. మూత్రస్థలియందు బుట్టిన యెడల పొట్ట తీపుగానుండును. మాటిమాటికి మూత్రమును విడువవలసి యుండును. కార్జమందు రాళ్లు పుట్టినయెడల నచ్చట తీపుగా నుండును. పిత్తవమన మగుచుండును.

చికిత్స :— మూత్రయంత్రము (కిడ్నీ) యందు రాళ్లు పుట్టినయెడల నెట్రంఫాస్ 3 మ. చూర్ణమును, రెండుగంటల కొకమా ఱీయ వలయును.

ఈవ్యాధి యెచ్చట బుట్టినను, బాధ నివారణార్థము, మ్యాగ్నెసియా ఫాస్ ౬ మ. చూర్ణమును వేడి నీటితోడ ౧౦, ౧౫ నిముసముల కొకమా ఱీయవలయును. మూత్రస్థలియందు పుట్టు రాళ్లకు క్యాలికేరియాఫాస్ 3 మ. చూర్ణమును రెండ్రుగంటల కొకమా ఱీయవలయును.

పసరుతిత్తియందు బుట్టినయెడల, నెట్రం సల్ఫు ౬ మ. చూర్ణమును, మ్యాగ్నేసియా ఫాస్ ౬ మ. చూర్ణమును రెండు మూడుగంటల కొకమాఱు వాడవలయును.

(౮౩) రొమ్ముజలుబు - (బ్రాంకటీస్)

శ్వాసయంత్రమందలి పెద్దవాయునాళముల యందుండు శ్లేష్మకోశ ముబ్బును. అందువలన దగ్గు, పడిసెము, జ్వరము, శ్వాసకష్టము, రొమ్ము లయందు వేదన, నాలుక తెలుపుగను, మలి నావృతమై యుండును. ప్రథమమున పొడిదగ్గు వచ్చును. పిమ్మట దగ్గుతోడ గట్టిగనుండు కళ్లె పడుచుండును. కళ్లె యుప్పగ నుండును.

చికిత్స:—ప్రథమావస్థయందు ఫెరంఫాస్ ౬ మ. చూర్ణమును రెండుగంటల కొకమాఱు తీయవలయును.

జ్వరముతోడ గట్టిశ్లేష్మము పడుచుండిన యెడల, ఫెరంఫాస్ ౬ మ. చూర్ణమును, కాలీ

మూరు ౬ వ. చూర్ణమును రెండుగంటల కొకమా ఱియవలయును. కన్నులవెంట నీరుగారుచుండినను, ౧౧ గంటలప్పుడు జ్వరము వృద్ధియైనను, అతిదాహ ముండినను, కాలీమూరుతోడ, నెట్రంమ్యూరు ౬ వ. చూర్ణమును గలిపి వాడవలయును.

ఈజాడ్యము, బాగుగ వృద్ధియైనప్పుడు, సిల్లివంటి పసుపు పచ్చని శ్లేష్మము పడుచుండును. అప్పుడు కాలీసల్ఫ ౬ వ. చూర్ణమును, ౩ గంటల కొకమా ఱియవలయును.

బలముకొఱకు క్యాలికేరియాఫాస్ ౬ వ. చూర్ణమును, రోజునకు రెండుమాఱులు మాత్ర మిచ్చుచుండవలయును.

వక్షఃస్థలమునకు చలిగాలి తగులకుండునట్లు జాగ్రత్తపడవలెను.

ఎప్పుడును ఫ్లానలుచొక్కాను దొడుగుకొనియుండవలయును. లేనియెడల, శాలువనుగాని

బూర్ణీసునుగాని యెప్పుడును గప్పుకొని యుండ వలయును.

శ్లేష్మము వెలుపలకు వచ్చుట కష్టముగ నుండినయెడల కాలీమూరు 3౦ వ. చూర్ణమును, 3౦ గ్రెయిను లోకయవ్రున్ను వాసలైను నందు గలిపి రొమ్మునకు బూయవలయును. అట్లు రాయునప్పుడు చలిగాలి తగులగూడదు. పాలు త్రాగవలయును. జావ, గంజి, బార్లీజావ, కిస్మిస్ పండును దినవచ్చును.

(౮౮) వడదెబ్బ

వైశాఖ, జ్యేష్ఠమాసములయందు, వడగాలి యందు దిరిగిన వడదెబ్బ తగులును. వడదెబ్బ తగిలినవాని శరీరము తిరుగుచుండును. అతిదాహముండును. మిక్కిలి దుర్బలుడై పడిపోవును.

చికిత్స:—నెట్రంమ్యూరు ౬ వ. చూర్ణమును, కాలీఫాస్ ౬ వ. చూర్ణమును, అర

గంట కొకమారు త్రీయవలయును. తలమీద చలి నీళ్లు చల్లవలయును. కాళ్లమీద వేడినీళ్లు,పోయ వలయును. రోగిని పక్కమీద బరుండబెట్ట వలయును.

(౨౫) వమనము

వమనముతోడ, అమ్లము, భుక్తద్రవ్యములు, శ్లేష్మము పడుచుండును. కొందఱకు వమన మందు రక్తముగూడ పడుచుండును.

చికిత్స:—అమ్లవమన మగుచుండిన యెడల, నెట్రంఫాస్ 3 మ. చూర్ణమును రెండుగంటల కొకమారు త్రీయవలయును.

అజీర్ణభుక్తద్రవ్య వమనమునకు, ఫెరంఫాస్ ౬ మ. చూర్ణమును రెండుగంటల కొకమారాఱు వాడవలయును.

కడుపునందు పురుగు లుండుటవలన వమన మైనచో, నెట్రంఫాస్ 3 మ. చూర్ణమును ౨ గంటల కొకమారాఱు పుచ్చుకొనవలయును.

రక్తవమన మగుచుండిన యెడల ఫెరంఫాస్ ౬ మ. చూర్ణమును బుచ్చుకొన వలయును.

రక్తము నలుపుగను, కండలు కండలుగను, పడుచుండినయెడల, కాలీమూరు ౬ మ. చూర్ణమును, దినమునకు నాలుగయిదు మాఱులు దినవలయును.

రక్తము కాఫీగింజలవలె గడ్డకట్టి ఉండలుండలుగ పడుచుండినయెడల కాలీఫాస్ ౬ మ. చూర్ణమును ౨గంటలకొకమాఱీయవలయును.

నీళ్ల వమనములకు నెట్రంమ్యూరు ౬ మ. చూర్ణము ౨ గంటలకొక మోతాదు చొప్పున బుచ్చుకొనవలయును.

పిత్తవమనములకు నెట్రంసల్ఫు ౬ మ. చూర్ణమును దినమునకు ౫-౬ మాఱులు తినవలయును. ఈవ్యాధి గలవారలు అతి సులభముగ జీర్ణమగు వస్తువులను మాత్రమే తినుచుండుట మంచిది. బలువగు పదార్థములను, అజీర్ణమును

గలిగించు వానిని దినరాదు. జావ, గంజి, పండ్ల రసమును త్రాగుట మంచిది.

## (౮౯) వేదన

వేదన రెండువిధములు. ఇం దొకటి నరములకు సంబంధించినది. ఇది నరముల యుత్తేజనమువలన గలుగుచుండును. ఇది వచ్చుచు బోవుచుండును. సాధారణముగ బాధయున్నచోట నొత్తినయెడల బాధకొంచెము తరిగినటు లుండును. రెండవది రక్తాధిక్యమువలన గలుగువేదన. ఈబాధకు విరామముండదు. అదిమిపట్టిన వృద్ధియైనటు లుండును.

చికిత్స:—స్నాయువిక వేదన, మిక్కిలి తీక్ష్ణముగను, శూలవలె నుండినను, ఆవిరివలనను, అదిమిపట్టుటవలనను, బాధ తరిగినటులుండినను, మ్యాగ్నెసియా ఫాస్ ౯ మ. చూర్ణమును వేడి నీటితో నిచ్చినయెడల నయమగును.

మఱియు స్నాయువిక వేదన, పక్షవాతమును బోలియుండినను, సాధారణముగ నొక్కిపట్టిన శాంతిగనున్న యెడలను, బాగుగ నొక్కిపట్టిన యెడలను, కాలీఫాస్ ౬ మ. చూర్ణమును రెండు గంటల కొకమాఱు తీయవలయును.

రక్తాధిక్యమువలనగాని, అఘాతమువలనగాని గలుగు వేదనకు, ఫెరంఫాస్ ౬ మ. చూర్ణమును రెండుగంటల కొకమాఱు తీయవలయును. నయముగానియెడల కాలీమూరు ౬ మ. చూర్ణమును వాడవలయును.

అఘాతము లేక రక్తాధిక్యమువలన గలుగు వేదనకు ఫెరంఫాస్ 3 మ. చూర్ణమును బాధయున్నచోట పట్టు వేయవలయును. స్నాయువిక వేదనకు కాపుపట్టవలయును.

(౮౭) వేవిళ్లు

గర్భిణిస్త్రీ లుదయమున కక్కుకొనుటను వేవిళ్లందురు. గర్భోత్పత్తి యయినప్పటి

నుండియు, లేక రెండుమూడు మాసములు గడచిన పిమ్మటను వేవిళ్లు ప్రారంభమగును. సాధారణముగ వేవిళ్లు కొలదిదినములలో తగ్గును. కాని కొందఱకుమాత్రము నీళ్లాడువఱకుండును. వేవిళ్లవలన స్త్రీలు మిక్కిలి బలహీను లగుదురు. ఏల యన, భుజించినంతనే కక్కుకొనుచుందురు. అందువలన జీర్ణకోశమందు భోజనపదార్థము నిలువయుండదు. కావున మిక్కిలి బలహీను లగుదురు.

చికిత్స:—వమనమం దాహ్లము ండినయెడల నెట్రంఫాస్ 3 మ. చూర్ణమును రోజుకు రెండు మూడుమాఱు లీయవలయును.

పిత్తవమన మగుచుండినయెడల, అనగా, నోరు పులుపుగను, ఎప్పుడు కక్కు వచ్చునటు లుండినను, నెట్రంసల్ఫు 3 మ. చూర్ణమును రోజునకు మూడు నాలుగు మాఱు లీయ వల యును.

నీటినిమాత్రమే కక్కుకొనుచుండిన యెడల నెట్రంమ్యూరు ౬ మ. చూర్ణమును రోజునకు మూడునాలుగుమాఱు లీయవలయును.

పైన వివరించిన చూర్ణములవలన కక్కులు గట్టుకొననియెడల, క్యాలికేరియాఫాస్, కాలీమూరు, కాలీసల్ఫులను వాడవలయును.

పాలు త్రాగవచ్చును. పండ్లు దినుచుండుట మంచిది. మిక్కిలి సులభముగ జీర్ణమగు భోజన పదార్థములను మాత్రమే పుచ్చుకొనవలయును.

## (౮౮) సెగరోగము

ఈ జాడ్యమువలన మూత్రద్వారమందు మంటయుండును. మాటిమాటికి మూత్రమును విడువవలసివచ్చును. మూత్రద్వారమునుండి చీము గాఱుచుండును.

చికిత్స:—కాలీమూరు ౬ మ. చూర్ణమును దినమునకు మూడునాలుగుమాఱులు పుచ్చుకొనవలయును.

మంట యుండినయెడల నెట్రంమ్యూరు 3 మ. చూర్ణమును, కాలీమ్యూరు ౬ మ. చూర్ణమును పర్యాయక్రమముగ రెండుగంటల కొకమాఱు దినవలయును.

ఈ వ్యాధి శరీరమందు జనించినయెడల సాయిలీసియా, ౬ మ. చూర్ణమును దినమునకు మూడునాలుగుమాఱుల చొప్పునదినవలయును.

రక్తవిహీన మైనయెడల క్యాలికేరియాఫాస్ ౬ మ. చూర్ణమును దినమునకు రెండుమాఱులు పుచ్చుకొనవలయును.

(౮౯) శయ్యామూత్రము

పిల్లలు నిద్రించునప్పుడు పక్కమీాద మూత్రమును విడుచుచుందురు. కొంత వయసు వచ్చినవారుగూడ నిద్దుర తెలియకపక్కమీాదనే మూత్రమును విడుచుచుందురు. కడుపునందు పురుగు లుండుటవలన గూడ నీవ్యాధి గలుగుచుండును.

చికిత్స:—పురుగు లుండుటవలన నీ వ్యాధి గలిగిన యెడల నెట్రంఫాస్ 3 మ. చూర్ణమును దినమునకు రెండు మూడుమారు లీయవలెను.

ఫెరంఫాస్ 3 మ. చూర్ణమును రోజునకు రెండుమారు లిచ్చుటవలన గూడ మేలుగలదు.

నెట్రంసల్ఫు 3 మ. చూర్ణమును రోజునకు రెండు మూడు మారు లిచ్చిన నయమగును.

సాయంత్రమైన పిమ్మట మంచినీళ్లు, పాలు మొదలగువానిని త్రాగనియ్యగూడదు.

## (౯౦) శీతపైత్యపు దద్దులు

శరీరమం దంతటను శీతపైత్యపు దద్దులు లేచును. ఇవి చిన్నవిగను పెద్దవిగను నుండును. సాధారణముగ శరీరమందలి పిత్తము చెడుట వలనను, ఆహార పదార్థములయందలి దోషము వలనను, నీవ్యాధి గలుగుచుండును. ఇది యెండ కాలమందు తక్కువగను, శీతకాలమందు

మిక్కుటముగ నుండును. క్రమేణ వృద్ధి యగు చుండును.

చికిత్స:—కాలీఫాస్ ౬ మ. చూర్ణమును రెండుగంటల కొకమారు పుచ్చుకొనవలయును. ఇది నరములసంబంధ మగు నుత్తేజనము నడంచును గాన, నందువలన బుట్టినయెడల వెంటనే నయమగును.

అజీర్ణద్రవ్యములను దినుటవలన నిది గలిగిన యెడల క్యాలికేరియాఫాస్ 3 లేక, ౬ మ. చూర్ణములను బుచ్చుకొనిన నయమగును.

ఆమ్లమువలన నిది గలిగినయెడల నెట్రంఫాస్ 3 మ. లేక, ౬ మ. చూర్ణములవలన మిక్కిలి లాభము గలుగును.

పైత్యవృద్ధివలన నైనయెడల నెట్రంసల్ఫు ౬ మ. చూర్ణమును బుచ్చుకొనుటవలన నయమగును. కొందఱకు కాలీసల్ఫును బుచ్చుకొనుట వలన గుణము గనబడును.

కాలీమూరు, నెట్రంమ్యూరులను పర్యాయ క్రమముగ సేవించుటవలన కొందరికి నయమగును.

సిలీసియాను బుచ్చుకొనుటవలన గూడ నారోగ్యము గలుగును.

ఈ రోగి విరేచనము ఝూడించి యగునట్టి పదార్థములను మాత్రమే భుజింపుచుండవలయును. పైత్యవృద్ధి నొనర్చువానిని దినరాదు.

## (౯౧) శూలనొప్పి

దీని నింగ్లీషునందు 'కాలిక్' అని చెప్పుదురు. శూలనొప్పివచ్చుట కనేక కారణములు గలవు. కాని ముఖ్యముగ నజీర్ణద్రవ్యములను దినుటవలనను, ఆమ్లమువలనను, పేగులయందు వాయువు చేరుటవలనను, నీవ్యాధి గలుగుచున్నది. కడుపునందు పురుగు లుండుటవలన గూడ శూలనొప్పి గలుగుచుండును.

చికిత్స:—ఆమ్లము వృద్ధియగుటవలన శూల నొప్పి పుట్టినచో, నెట్రంఫాస్ 3 ను. చూర్ణమును, మ్యాగ్నెసియాఫాస్ ౬ ను. చూర్ణమును కలిపిగాని, పర్యాయక్రమముగా గాని, యుష్ణజలముః నరగంట కొకమా ఱీయవలయును. కొంతమందికి దీనితోడ క్యాలికేరియాఫాస్ ౬ ను. చూర్ణమును గూడ నీయవలసియుండును. శూలనొప్పుల కన్నిటికిని మ్యాగ్నెసియాఫాస్ ప్రధానౌషధము. కావున శూల నొప్పికి కారణమును గనుగొని, దాని కీయవలసిన యౌషధమును, మ్యాగ్నెసియా ఫాస్తోడ పర్యాయక్రమముగ నీయవలయును.

ఋతుకాలమందు వచ్చు శూలవేదనను మ్యాగ్నేసియాఫాస్తోడ, కాలీమూరును లేక, ఫెర్రంఫాస్ను పర్యాయక్రమముగ నీయవలెను.

పిత్తశూలమైనయెడల మ్యాగ్నేసియాఫాస్ తోడ, నెట్రంసల్ఫును వాడవలయును.

రాళ్లుంకుటచేత శూలనొప్పి వచ్చినయెడల, మ్యాగ్నెసియా ఫాస్‌తోడ, క్యాలికేరియా ఫాస్‌ను వాడవలయును.

సాధారణముగ శూలనొప్పితోడ జ్వర ముండదు. కాని యజీర్ణద్రవ్యభక్షణమువలన శూల నొప్పి గలిగినచో కొందఱకు జ్వరము గూడ నుండును. దానికి ఫెరంఫాస్‌ను, మ్యాగ్నెసియా ఫాస్‌ను నీయవలయును.

పిల్లలు మిక్కిలి తీపుగనుండు పదార్థములను దినుటవలన కడుపునొప్పి, శూలనొప్పి పుట్టును. అప్పుడు పిల్లలు కాళ్లుముడుచుకొని పరుండెదరు. ఇటునటు పొర్లుగింతలు పెట్టుచుందురు. కడుపులో గుడగుడ లాడుచుండును. కాపుబట్టినను నొప్పి తరుగును. దానికి నెట్రంఫాస్ 3వ.చూర్ణమును, మ్యాగ్నెసియాఫాస్ 3 లేక, ౬ వ. చూర్ణముల నీయవలయును.

పురుగు లుండుటవలన శూలనొప్పి గలిగిన యెడల, నెట్రంఫాస్ 3 వ. చూర్ణమును, సా ఋలీసియా ౬ వ. చూర్ణమును పర్యాయ క్రమముగ వాడవలయును.

శూలనొప్పి కిచ్చు మందులన్నియు వేడినీళ్ల తో గలిపి యీయవలయును. పొట్టకు ఆవిరిని బట్టవలయును. విరేచనబద్ధక ముండినయెడల వేడినీళ్లపిచికారిని చేయవలయును. శూలనొప్పి, యున్నప్పుడు త్రాగుటకు వేడినీరుతప్ప మరియే పదార్థము నీయగూడదు. నొప్పితరిగిన పిమ్మట భుజింపవచ్చును. కాని యతిసులభముగ జీర్ణ మగువానిని మాత్రమే భుజింపవలయును.

(౯౨) శ్వాసకోశముమీద నుండు పొర పచ్చి పుండగుట

సాధారణముగ నీవ్యాధి కుడివైపున నుండు, శ్వాసకోశమునకు వచ్చును. దీనిని కొందఱు పార్శ్వవేదన యందురు. కాని యిది పార్శ్వ

వేదన గాదు. నిమోనియా రోగమునకంటె నీ వ్యాధికి వేదన మిక్కుటముగ నుండును. దీనికిని జ్వరముండును. కాని, నిమోనియారోగమునకు వచ్చినంత జ్వరము రాదు. నిమోనియారోగము తోడ సాధారణముగ నీరోగ ముండును. కాని యీ వ్యాధి వచ్చునప్పుడు, నిమోనియా వచ్చునని చెప్పుటకు వీలు లేదు. ఈ వ్యాధికి దగ్గు సాధారణముగ నుండును. కాని దగ్గునప్పుడు మిక్కిలిబాధ యుండును. ప్రథమావస్థయందు రోగి వేదనస్థానము ప్రక్కకుదిరిగి పడుకొనును. నిశ్వాస ప్రశ్వాసలను విడుచుట కష్టముగ నుండును. ఈ రోగమునకు, దగ్గు, జ్వరము, కుడివైపు డొక్కయందు బాధయుండును. కాని పార్శ్వ వేదనకు నొప్పిమాత్రమే యుండును. దగ్గు, జ్వరము, మొదలగునవి యుండవు. పార్శ్వపు నొప్పి వచ్చినరోగి నొప్పియుండినవైపునకు తిరిగి పరుండజాలడు.

చికిత్స:—ఈ వ్యాధివచ్చినంతనే ఫెరంఫాస్ ౬ మ. చూర్ణమును రెండుగంటల కొకమాఱీయ వలయును. కొందఱకు ఫెరంఫాస్‌తోడ పర్యాయ క్రమముగ నెట్రంమ్యూరు ౬ మ. చూర్ణమును గూడ నీయవలయును.

శరీరబలమునకు గాను ఉదయము, సాయంత్రము, క్యాలికేరియాఫాస్ ౬ మ. చూర్ణమును రెండుమోతాదు లీయవలయును.

రోగిని, మంచిగాలి తగులునట్టియు, వేడిగ నుండునట్టియు గదియందు, శుభ్రమగు వస్త్రములమీద బరుండబెట్టవలయును. శరీరము నిండ వస్త్రమును గప్పవలయును. బాధ యెక్కుడుగ నుండినయెడల నా భాగమునకు కాపు గాని, ఆవిరి గాని బట్టవలయును. లేక, ఫెరంఫాస్ మలామును బట్టించి, దానిమీద ఫ్లానలు గుడ్డను గట్టవలయును. కాని చలిగాలి యేమాత్రము

తగులగూడదు. పాలు, బార్లీ, జావ మొదలగు వాని నీయవచ్చును.

## (౯3) శ్వాసకోశమందలి నరములకు వాతము గ్రమ్ముట

ఇది నరములసంబంధ మగు వాతరోగము. చలిగాలితగిలి వక్షఃస్థలమందలి నరము లుబుకుట వలన, నీవ్యాధి గలుగుచున్నది. నిశ్వాస ప్రశ్వాసలు విడుచునప్పుడును, అటునిటు గదలినను, వేదన వృద్ధి యగుచుండును. ఈవ్యాధి మెడ నరములకు గూడవచ్చును. అందువలన మెడ నిటునటు త్రిప్పుటకు మిక్కిలి బాధగనుండును.

• చికిత్స:—ఫెరంఫాస్ ౬ మ. చూర్ణమును రెండుమూడుగంటల కొకమారు పుచ్చుకొనవలయును. మరియు దీనిని వాసలయినునందు గలిపి బాధ యున్న స్థానమందు పూయవలయును. కాపు పట్టవలయును. ఆవిరిబట్టుట

మంచిది. బాధ యున్న చోట స్లానలు గుడ్డను చుట్టవలయును. చలిగాలి తగలగూడదు.

## (౬౮) సూతికాజ్వరము

ప్రసవానంతరము, స్రావము కట్టుపడుట వలన రగి దినము లయినపిమ్మట జ్వరము వచ్చును. కడుపులో నొప్పి దడ వేదన మొదలగునవి యుండును. ఇది కఠినవ్యాధి.

చికిత్స:—ప్రథమమున, ఫెరంఫాస్ ౬ మ. చూర్ణమును, కాలీఫాస్ ౬ మ. చూర్ణమును గలిపియు, కాలీమూరు ౬ మ. చూర్ణమును, పర్యాయక్రమముగ వాడవలయును. అతిదాహ ముండిన యెడల, కాలీమూరుతోడ నెట్రం మ్యూరును గలపి యీయవలయును. పొట్టకు ఆవిరిపట్టవలయును. కాపుకాయవలయును. ఫెరం ఫాస్ 3 మ. చూర్ణమును పట్టువేయవలయును. ప్రసవద్వారమును, ఆవశ్యక మగు నౌషధ

మును గలిపిన వేడినీళ్లతోడ గడుగవలయును. పాలు ద్రావవచ్చును.

(౯౫) స్వప్నమందు భయపడుట

యౌవనులలో, ముఖ్యముగ భీతచిత్తులును దుర్బలులును, స్వప్నమందు మిక్కిలి భయపడు చుందురు. నిద్రయందు పలువిధములగు స్వప్నములను గాంచి యరచుచుందురు. మాట్లాడు చుందురు. ఏడ్చెదరు. ఎదురురొమ్ములమీద నెవ్వరో కూర్చుండినటుల దలంచుచుందురు. స్త్రీలకు గూడ నీవ్యాధి యుండును. ఇంటియందు దొంగలు ప్రవేశించినారని తలంచుచుందురు. ఇతర మార్గముల శుక్లనష్ట మొనర్చుకొనుటవలనను, మిక్కిలి మనోవ్యాకులత్వము వలనను అజీర్ణమును గలిగించు పదార్థములను దినుటవలనను, నీవ్యాధి గలుగుచుండును.

చికిత్స:—కాలీఫాస్ ౬ వ. చూర్ణమును, దినమునకు రెండుమాఱులు పుచ్చుకొన వల

యును. పడుకొనబోవునప్పు డొక మోతాదును బుచ్చుకొనవలయును.

మిక్కిలి దుర్బలత్వ మొందినయెడల దినము నకు రెండుమాఱులు క్యాలికేరియాఫాస్ ౬ వ. చూర్ణమును బుచ్చుకొనవలయును. శయనించు నప్పుడు కాలీఫాస్ ౬ వ. చూర్ణము నొక మోతాదును బుచ్చుకొనవలయును.

అజీర్ణము,ఆమ్లముండినయెడల నెట్రంఫాస్‌ను సేవించవలయును. ఈరోగి వెల్లకిల బడుకొన గూడదు. కఠినశయ్యమీద బరుండవలయును. కాళ్లు చేతులు చలినీళ్లతో గడుగుకొని పరుండ వలయును. హరినామస్మరణ జేయుచు పరుండుట మంచిది. రాత్రులాహారమును తక్కువగ భుజింప వలయును. అజీర్ణమును ఆమ్లమును గలిగించు వానిని దినరాదు. మంచి గాలియందు దిరుగు చుండవలయును. శీతలజలస్నానము మంచిది. మానసిక పరిశ్రమను మిక్కుటముగ చేయగూడదు.

## (౯౬) స్వరభంగము

జలుబుచేయుటవలన గాని, మిక్కిలిగ అఱచుటవలనగాని, గొంతు బొంగురు పోవును.

చికిత్స:—కాలీమూరు ౬ మ. చూర్ణమును రోజునకు నాలుగైదుమారులుపుచ్చుకొనవలెను.

మిక్కిలి అఱచుటవలన గాని, సంగీతము పాడుటవలన గాని, గొంతు బొంగురు పోయిన యెడల ఫెరంఫాస్ ౬ మ. చూర్ణమును దినమునకు మూడు నాలుగు మాఱులు పుచ్చుకొనవలెను. ఈ వ్యాధికి కాలీసల్ఫును బుచ్చుకొనవలెను.

జలుబువలన నీవ్యాధి కలిగిన యెడల గొంతుకు ఫ్లానలు గుడ్డను జుట్టుకొన వలయును. మాట్లాడ గూడదు. వేడివేడిపాలు త్రాగవలయును. వేడియన్నమును భుజింపవలయును. వేడినీటిని త్రాగవలయును.

## (౯౭) స్మృతిదప్పుట

రక్తస్రావమువలన గాని, భయము వలన

గాని, మరి యే యితరకారణములవలన నైనను, ఆకస్మికముగ, తెలివితప్పి పడిపోవుటను, స్మృతి దప్పుటయందురు. అజ్ఞానియై పడినప్పుడు కాళ్లు చేతులు కదలవు. జ్ఞానము సంపూర్ణముగ గాని, యసంపూర్ణముగ గాని లోపించును.

చికిత్స:— ఇట్టి వానిని, బాగుగ గాలి వీచు ప్రదేశమందు వెల్లకిల బరుండబెట్ట వలయును. మోమున శీతలజలమును చల్లవలయును. చేతులకు కాళ్లకు నావిరి పట్టవలయును. కాలీ ఫాస్ ౬ మ. చూర్ణమును, నాలుకమీద పూయ వలయును. స్మృతి రానియెడల దానితోడ ఫెరంఫాస్‌ను గూడ పూయవలసి యుండును.

## (౯౮) స్త్రీజననేంద్రియకోశము స్థానభ్రష్ట మగుట (గూఢ)

ఇది యేకారణమున నేవిధముగ స్థానభ్రష్ట మైనను చికిత్సావిధాన మొక్కటియే.

చికిత్స:— క్యాలికేరియా ప్లవరు ౧౨ మ. చూర్ణమును దినమునకు ఆఱు మోతాదులు పుచ్చుకొనవలయును.

మరియు గూదను లోపలికినెట్టి, క్యాలికేరియా ప్లవరు 3 మ. చూర్ణమును 30 గ్రైయిను లోకయవున్సు వాసలైనునందు గలిపి, దానికి పట్టించవలయును. రోగి బలహీనముగ నుండిన యెడల క్యాలికేరియాఫాస్ ౬ మ. చూర్ణమును దినమునకు రెండుమాఱులు పుచ్చుకొన వలయును.

ఈరోగి నడువ గూడదు. మెట్లెక్కగూడదు. కదల మెదలక పరుండియుండ వలయును.

రఘూడించి విరేచన మగు పదార్థములను దినుచుండవలయును. మఱియు నీవ్యాధికి డాక్టరుల సహాయమును బొందుట మంచిది.

(౯౯) తుయదగ్గు

దగ్గుతోడ రక్తము పడుచుండిన యెడల

దానిని క్షయదగ్గని చెప్పుదురు. కొందఱ కధిక మగును. కొందఱ కల్పముగను. దగ్గునందు రక్తము పడుచుండును.

చికిత్స:— ఫెరంఫాస్ ప్రధానౌషధము. కావున ౬ వ. చూర్ణమును రెండుగంటల కొకమాఱు పుచ్చుకొనవలయును. కొందఱకు దీనితోడ నెట్రంమ్యూరును గూడ పర్యాయక్రమముగ వాడవలసి యుండును.

దీనికి రక్తముయొక్క వర్ణమును బట్టి చికిత్స చేయవలయును. కావున రక్తస్రావమును గురించి వ్రాసిన విషయములను జూచి మం దీయవలెను.

సంపూర్ణము.

---

ఆంధ్రపత్రికా కార్యాలయము, చెన్నపురి.—౧౯౧౭.

# భక్తియోగము

## తృతీయముద్రణము

శ్రీయుత, బాబు, అశ్వనీకుమారదత్తు యం. ఏ. బి. యల్. గారి బంగాళీ గ్రంథమున కాంధ్రీకరణము. పండితులనక పామరులనక యెల్లరును బఠింపదగిన గ్రంథము. ఇందు సాధనవిషయము లనేకములు చెప్పబడియున్నవి. ఆంధ్రదేశమందలి పండితులలో ననేకు లీగ్రంథమును బొగడియున్నారు.

3౬౦ పుటలు, కాలికోబైండు, వెల రు. ౧-౦-౦.

# సీతాదేవి వనవాసము

## ద్వితీయముద్రణము

అనగా నుత్తరరామచరితము. కరుణారసపూరిత మగు నీగ్రంథమును చదువునప్పుడు కంట దడిపెట్టనివా రుండరు. పండిత ఈశ్వరచంద్రవిద్యాసాగరుల బంగాళీ గ్రంథమున కాంధ్రీకరణము. ప్రతిగృహమం దుండదగిన గ్రంథము. వెల ౦-౬-౦.

ఇట్టి సర్వాంగసుందర మగు గ్రంథము లాంధ్రమున లేవు.

రెండురంగులలో ముద్రితము.

# సతీదేవి (దాక్షాయని)

ఇయ్యది పరమేశ్వరుని యర్ధాంగి యగు సతీదేవి చారిత్రము. దశరా, సంక్రాంతి, దీపావళి మొదలగుపండు గలయందు, బాలికాబాలకుల కొసంగుట కత్యుత్తమ గ్రంథము. గ్రంథమంతయు రెండురంగుల ముద్రింపబడినది. ఇందు మూడురంగులబొమ్మలుగలవు. మ.రా.రా.శ్రీ,కొండ వేంకటప్పయ్యపంతులు బి. ఎ. బి. యల్. గా రుపోద్ఘాత మును వ్రాసియున్నారు. ఫైదరువైటు కాగితమువీఁద ముద్రింపఁబడినది. వెల రు. ౦-౬-౦.

# తుకారాముచరిత్రము

## ద్వితీయముద్రణము

మహారాష్ట్రజాతీయోద్ధారకుఁడును, మహాభక్తుఁడు నగు తుకారామునిచరిత్ర మెల్లరు బఠింపఁదగినది. ఇందు తుకారాముని పటము గలదు. వెల రు. ౦-౬-౦.

# విదుషీమణులు

వేదకాలము మొదలుకొని ధారావాహికముగ భారతవర్షమందలి విద్వాంసురాంద్ర్ర చరిత్రము లిందు వర్ణింపఁబడినవి. ఆంధ్రబాలికల హస్తములయందలరారఁదగినది. ఈ గ్రంథమునకు, ఆంధ్రజాతీయకళాశాలాధ్యక్షులగు, కోపల్లె హనుమంతరావుపంతులు ఎం. ఏ. బి. యల్. గారు ఉపోద్ఘాతమును వ్రాసియున్నారు.

వెల కాలికో రు. ౦-౧౨-౦.
,, రాపరు రు. ౦-౯-౦.

# సావిత్రీదేవి

ఇయ్యది సుప్రసిద్ధమగు భారతకథ. దీనినిగురించి మిక్కుటముగ వర్ణించుట యనావశ్యము. కాని గ్రంథమంతయు నూతనపద్ధతుల రచింపఁబడినది. మ. స. రా. శ్రీ. కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు పీఠికను వ్రాసియున్నారు. ౪౦ పౌనుల కాగితముమీఁద గ్రంథమంతయు రెండురంగుల ముద్రింపబడియున్నది. ఇందు మూడురంగుల పటము లొకటి గలవు.

వెల రు. ౦-౮-౦.

ర

# మల్లికాగుచ్ఛము

గ్రంథకర్త:— మ. రా. రా. శ్రీ, మాడపాటి
హనుమంతరావుపంతులు గారు.

ఇందతిమనోహరముగ వర్ణింపబడిన
చిన్నినవల లేడు గలవు.

౧. హృదయశల్యము. ౨. రాణీసారంధా. ౩. ముసలిదాని యుసురు. ౪. నేనే. ౫. అగ్నికుండము. ౬. నాడు నీపంతము - నేడు నాపంతము. ౭. ఆత్మార్పణము.

వెల కాలికో రు. ౦-౧౪-౦. రేపరు రు. ౦-౧౨-౦.

పై గ్రంథములు గావలసినవార లీక్రిందిచిరునామాకు వ్రాసికొనవలయును.

కార్యనిర్వాహకుడు.
సరస్వతీనికేతనము, బందరు.